# చిత్రముల(PPT) ద్వారా, సైన్స్ ద్వారా ఆత్మజ్ఞానం(బ్రహ్మజ్ఞానం)

## (బాధ, దుఃఖం, అసంతృప్తి, నిరాశతో వచ్చే ఆలోచనలను సమర్ధవంతంగా ఎదుర్కోవటం ఎలా?)




కోమిరెడ్డి రాజా రమేష్ రెడ్డి

(Free Gurukul Founder)

www.freegurukul.org

Mobile: 9042020123



5th Dec 2022 : Version - 4.6

# విషయ సూచిక

## Part -1 ఎందుకు?



## Part -2 సిద్ధాంతము / Theory



## Part -3 నిజ జీవిత అనుభవాలు / Practical

## Part - 4 సాధన

మోక్ష సాధనకు అనువైన జన్మ, పరిస్థితులు, వాతావరణంలో జన్మించటం అత్యంత కష్టం

సాధన - ఇది క్రొత్తగా వచ్చినది కాదు, మనకు అలవాటు అయినదే!

సాధనాక్రమం

ప్రతి ఆలోచనను ఆత్మ జ్ఞాన దృష్టి కోణంతో ఆలోచించటం

నిజానికి కర్మ ఎవరు చేస్తున్నారు? ఎవరి వలన జరుగుతుంది?

ఈ ప్రపంచమే ఒక సాధన వస్తువు

బంధువుల, అనుబంధాలపై మమకారం తగ్గించుకోవటం ఎలా?

ఈ జ్ఞానం తెలుసుకొంటే భయం ఉండదా?

కొందరు దుర్మార్గంగా ఉన్నప్పటికీ మంచి జరుగుతుంది, సుఖాలు అనుభవిస్తుంటారు, ఎందుకని?

సమాజంలో దుర్మార్గం, అన్యాయం, ఘోరాలు చేయటం చూస్తుంటాము, ఎలా?

కోరికలు ఎలాంటివి అంటే?

వింతలు, విచిత్రాల ఆకర్షణ నుంచి బయటపడటం ఎలా?

అవసరం లేని, ఉపయోగం లేని విషయాలపట్ల, వస్తువుల పట్ల, వ్యక్తుల పట్ల జాగ్రత్త!

ఆత్మజ్ఞానం తెలుసుకొంటే పని చేసేటప్పుడు నాణ్యత పెరుగుతుందా?

ఆత్మ జ్ఞానం, బ్రహ్మ జ్ఞానం తెలుసుకొంటే కోరికలు/ఆలోచనలు ఎలా తగ్గుతాయి?

పురుష ప్రయత్నం ఎందుకు?

కోరికను బలవంతంగా అణచటం, కోరికను తీసివేయటంకు మధ్య తేడా?

ఆలోచనలను ఆత్మ జ్ఞానంతో ఫిల్టర్ చేస్తే సున్నా(0) అవుతాయి

ఆత్మ జ్ఞానం తెలుసుకొన్న తర్వాత ఎలా ఉండాలి?

ఈ జ్ఞానం తెలుసుకొన్న తర్వాత మీ ఆలోచనలలో మార్పులు గమనించండి

ఆత్మ జ్ఞానాన్ని ఆచరణలో చేసేటప్పుడు అతి తెలివి వద్దు!

ఒత్తిడి తగ్గాలంటే కర్తృత్వం వదిలేయి

జ్ఞాని vs అజ్ఞాని దృష్టికోణం

ఉద్దేశ్యపూర్వకంగా లక్ష్యాలు(GOAL) పెట్టుకోవద్దు!

ప్రారబ్దం నుంచి తప్పించుకోలేము!

అందరూ ఎందుకు ఆత్మ జ్ఞానం తెలుసుకోలేకపోతున్నారు?

## Part - 5 ప్రశ్నలు – సమాధానాలు

వైరాగ్యం

కర్మ x మోక్షం

పదాలు – అర్థాలు

బ్రహ్మం గురించి ఆధారాలు

ప్రశ్నలు – జవాబులు

Youtube Recorded Videos

Recommend to Read & Watch



# Part -1
# ఎందుకు?

## Part -1 ఎందుకు ఆత్మజ్ఞానం,బ్రహ్మజ్ఞానం అనే ఆయుధం కావాలి?

- ఇల్లు కట్టేటప్పుడు తుఫానుని కూడా తట్టుకొనేలా కట్టుకోవాలి, ఊహించని ప్రమాదం వస్తే ఇల్లు కూలిపోగలదు.
- పెళ్లి చేసుకొనేటప్పుటకి కష్టాలను ఏ రూపంలో నుంచి వచ్చినా తట్టుకొనేలా ఉండాలి, లేకపోతే విడాకులు అవుతాయి.
- కార్ కొనేటప్పుడు ప్రమాదాన్ని తట్టుకొనేలా ఉండాలి(Air Bags), లేకపోతే ప్రమాదం వస్తే ప్రాణాలు పోగలవు.

అలాగే జీవితం ఎప్పుడూ సాఫీగా పోదు, ఎప్పుడు ఏ క్షణం నుంచి ఉపద్రవాలు వస్తాయో తెలియదు, అటువంటప్పుడు మొట్టమొదట కలిగే ప్రశ్న "నేను ఎందుకు బ్రతకాలి?" "ఎవరికోసం బ్రతకాలి?" అనే శూన్యత, బాధ, దుఃఖం, విరక్తి కలుగుతుంది. అది ఆత్మహత్యకి, మానసిక వ్యాధులకు దారి తీస్తుంది. కావున అటువంటి ప్రమాదాలనుంచి బయటపడటానికి ముందుగానే ఆయుధాలను సిద్ధం చేసుకోవాలి. ఆ ఆయుధమే ఆత్మ జ్ఞానం/బ్రహ్మ జ్ఞానం!

Note: ఇది తెలుసుకొంటే కష్టాలు రావు అని చెప్పటం లేదు. కష్టాలు వస్తాయి, వస్తే వెంటనే/తొందరగా ఎదుర్కొని ధైర్యంగా, సంతోషంగా ఉండొచ్చు! అని చెప్పటమే నా ఉద్దేశ్యం.



తుఫానుని తట్టుకోలేని ఇల్లు



తుఫానుని తట్టుకొనే ఇల్లు



ఎయిర్ బ్యాగ్ లేని కార్



ఎయిర్ బ్యాగ్ గల కార్

Part -1 # ప్రారబ్దం/ప్రమాదం ఏ రూపంలో, ఎలా, ఎప్పుడు వస్తుందో ఊహించటం కష్టం!

## మమకారం సంబంధ

భర్త మృతితో మనోవేదన.. గంటల్లోనే భార్య బలవన్మరణం

కూతురు డ్రైవర్ తో వెళ్ళిపోవటం వలన కుటుంబం ఆత్మహత్య

తన స్నేహితుడితో, భార్య ఏకాంతంగా ఉండటం చూసి, మానసిక రోగిగా(పిచ్చివానిగా) వీధులలో బిక్షాటన చేసుకోవటం










Extra Marital Affair: పొలం పని చేసుకుని ఇంటికి వచ్చిన అన్నకు షాక్..
తమ్ముడితో భార్యను అలా చూసి.. తమ్ముడిని గొడ్డలితో నరికేశాడు







### హయత్‌నగర్‌లో ఉరేసుకుని మహిళ ఆత్మహత్య

Nov 03,2019 07:19AM

హైదరాబాద్ : కూతురు ప్రేమ వివాహం చేసుకున్నదనే మనస్తాపంతో తల్లి ఉరేసుకుని ఆత్మహత్యకు పాల్పడిన సంఘటన హయత్‌నగర్ పోలీస్‌స్టేషన్ పరిధిలో జరిగింది. మన్సూరాబాద్ డివిజన్‌లోని వీరన్నగుట్ట కాలనీలో ఉంటున్న పాలెం శ్రీను ముదిరాజ్, పాలెం సత్తమ్మ (45) చిన్న కూతురు తులసి(18), అదే కాలనీలో ఉంటున్న నాగరాజు ప్రేమించుకుని గతనెల 30న ఆర్య సమాజ్‌లో వివాహం చేసుకొన్నారు. దీంతో తీవ్ర మనస్తాపానికి గురైన తులసి తల్లి సత్తమ్మ శనివారం మధ్యాహ్నం ఇంట్లో ఉరేసుకొని ఆత్మహత్య చేసుకుంది.

# అవమానం/కీర్తి/గుర్తింపు సంబంధ

Published: Sun, 25 Sep 2022 04:18:40 IST

**ఆర్టీసీ డ్రైవర్ ఆత్మహత్య**

**చేవెళ్ల, సెప్టెంబరు 24:** రంగారెడ్డి జిల్లా చేవెళ్ల మండలం కేసారానికి చెందిన ఆర్టీసీ బస్ డ్రైవర్ ప్రొప్రైటూర్ అశోక్(38) ఆత్మహత్య చేసుకున్నాడు. ఇందుకు ఉన్నతాధికారుల వేధింపులే కారణమని కుటుంబసభ్యులు ఆరోపిస్తున్నా రు. వారి కథనం మేరకు అశోక్ మెహిదీపట్నం డిపోలో డ్రైవర్‌గా విధులు నిర్వర్తిస్తుండేవాడు. వారం క్రితం అశోక్ నడిపిస్తున్న కార్లో బస్సు అద్దం పగిలింది. దీంతో రూ.30వేలు చె ల్లించాలని అధికారులు సూచించారు. పనిష్మెంట్ కింద రో జూ రాత్రి డ్యూటీలు వేశారు. ఈ విషయాలు తమకు చెప్పి బాధపడేవాడని కుటుంబసభ్యులు తెలిపారు. కాగా శనివారం విధులు ముగించి వచ్చిన అశోక్ ఇంట్లో ఉరేసుకున్నాడు.




**మనోవేదన తట్టుకోలేక ఓ వ్యక్తి ఆత్మహత్య: ఆయనకు పెళ్లైంది.. ఖాళీగా ఉంటున్నాడని భార్య వదిలేసిపోయింది. చివరికి ఒంటరిగా మిగిలిపోయాడు. మనోవేదనకు గురైన అతను ఓ చెట్టుకు ఉరివేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ ఘటన మెదక్ జిల్లాలో జరిగింది.**







**బోనాలకు రమ్మంటే రాలేదని మనస్తాపం.. భార్యతో వీడియో కాల్‌లో మాట్లాడుతూనే భర్త ఆత్మహత్య** 15-08-2022 Mon 10:06

తన బంధువుల ఇంట్లో బోనాల పండుగకు వెళ్దామని పిలిచినా రాలేదని భార్యపై అలిగిన భర్త ఆమెతో వీడియో కాల్‌లో మాట్లాడుతూనే ఆత్మహత్య చేసుకున్నాడు.

**Warangal News: వర్క్ ఫ్రం హోం తెచ్చిన తంటా.. భార్య, అత్తింటి వేధింపులకు భర్త సూసైడ్..**

నిహారిక... హైదరాబాదులో నివాసం ఉంటేనే కాపురం చేస్తాను అంటూ పుట్టింటికి వెళ్ళిపోయింది. అనంతరం తన తల్లిదండ్రులతో కలిసి రాకేష్‌కు వీడియో కాల్ చేయించిన నిహారిక రాకేష్ మనసు మార్చే ప్రయత్నం చేసింది. ఈ నేపథ్యంలో ఐదు నెలల గర్భవతైన నిహారిక కొన్ని రోజుల క్రితం రాకేష్‌కు వీడియో కాల్ చేసి... సూటిపోటి మాటలతో వేధించడం మొదలు పెట్టింది. నిహారిక తల్లిదండ్రులు సైతం ఫోన్ చేసి సూటిపోటి మాటలు అనడం మొదలు పెట్టారు. కలకాలం సంతోషంగా జీవిత భాగస్వామితో భవిష్యత్తును ఊహించుకున్న రాకేష్ తీవ్ర మనోవేదనకు గురై పురుగుల మందు తాగి ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

**పిల్లలు ప్రేమ వివాహం చేసుకొన్నారని, పరువు పోయిందని ఆత్మహత్య చేసుకొని కర్నూల్ SI మృతి**

**Guntur: రెవెన్యూ అధికారుల నిర్లక్ష్యం.. రైతు ఆత్మహత్య..**

తన పొలం ముంపునకు గురికాకుండా వేసుకున్న కట్టను.. రెవెన్యూ అధికారులు తొలగిస్తున్నా ఆపలేకపోయాననే బాధతో రైతు ఆత్మహత్య చేసుకోవడం ఉంగుటూరులో విషాదాన్ని నింపింది. ఈ రైతు ఆత్మహత్యకు ప్రభుత్వమే

**నొప్పి లేకుండా ఆత్మహత్య చేసుకున్న సాఫ్ట్‌వేర్ ఇంజనీర్... హైదరాబాదులో....**

ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన అమ్మాయి తనను మోసం చేసిందన్న మనస్తాపంతో తాజుద్దీన్ అనే సాఫ్ట్ వేర్ ఇంజనీర్ ఆత్మహత్యకు పాల్పడ్డాడు. విజయవాడలోని చిట్టి నగర్ చెందిన తాజుద్దీన్ ఆదివారం ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

**Extra Marital Affair: పొలం పని చేసుకుని ఇంటికి వచ్చిన అన్నకు షాక్.. తమ్ముడితో భార్యను అలా చూసి.. తమ్ముడిని గొడ్డలితో నరికేశాడు**

**Hyderabad crime: ప్రేమించిన వ్యక్తి కాదన్నాడని.. ఫ్యాన్ కు ఉరేసుకుని ఆత్మహత్య..**

హైదరాబాద్ లో విషాదం చోటు చేసుకుంది. ప్రేమించిన వ్యక్తి మోసం చేశాడన్న కారణంతో ఓ యువతి ఆత్మహత్యకు పాల్పడింది. విశాఖపట్నంలోని రామ్‌నగర్ ప్రాంతానికి చెందిన వాసర్ల అనూష..

**మేనేజర్ వేధింపులు తట్టుకోలేక ఉద్యోగి ఆత్మహత్య**

**కూతురు డ్రైవర్ తో వెళ్ళిపోవటం వలన కుటుంబం ఆత్మహత్య**

# ఎవరో చేసిన తప్పుకి మరొకరు బలి

## 8మంది విద్యార్థినుల ఆత్మహత్యాయత్నం.. ఒకరు మృతి..

చండీగఢ్ లోని ఓ ప్రైవేట్ వర్సిటీలో విద్యార్థినులు స్నానం చేస్తుండగా.. వీడియోలు తీసిన యువతి.. వారిలో ఒకరి చావుకి కారణమైంది. తమ వీడియోలు ఇంటర్నెట్ లో , సోషల్ మీడియాలో వైరలవుతుండడాన్ని అవమానించిన విద్యార్థినుల్లో 8 మంది మనస్తాపం చెంది ఆత్మహత్యాయత్నానికి పాల్పడ్డారు. వీరిలో ఒకరు మృతిచెందారు. వీడియోలు వైరల్ చేసిన యువతిపై పోలీసులు కేసు నమోదు చేశారు.

స్నానం చేసే సమయంలో ఆమె ఈ వీడియోలను రికార్డు చేసింది. సిమ్లాలో ఉన్న తన స్నేహితుడికి ఈ వీడియోలను పంపింది. ఈ వీడియోలను నిందితుడు యూట్యూబ్ లో అప్ లోడ్ చేశాడు.




**అర్ధ రాత్రి బస్ లేకపోవటంతో, నడుచుకొంటు వస్తున్న వారిని దొంగ అనుకొని ఊర్లో వ్యక్తులు కొట్టి చంపారు**

**స్నేహితురాలు తెలియకుండా బ్యాగ్ లో డ్రగ్స్ పెట్టి పోలీస్ లకు పట్టిస్తే, జీవిత ఖైదీ వేయటం**

**మహిళ రాత్రి పూట స్కూటర్ పై వెళ్తుంటే, కొందరు త్రాగి సామూహిక అత్యాచారం చేయటం**

**త్రాగుబోతు భర్త, అదనపు కట్నం కోసం కొట్టి ఇంటి నుంచి గెంటి వేయటం**

## Psycho Husband: ఆ నీచుడికి నా శవాన్ని కూడా తాకే అర్హత లేదు.. డైరీ రాసి గర్భిణి ఆత్మహత్య

Psycho Husband భర్త పెట్టే చిత్రహింసలు భరించలేక మూడు నెలల గర్భవతి ఆత్మహత్య చేసుకుంది. బాలాపూర్ పోలీస్‌స్టేషన్ పరిధిలో ఈ ఘటన చోటుచేసుకుంది.

- బాలాపూర్‌లో మూడు నెలల గర్భవతి ఆత్మహత్య
- భర్త చిత్రహింసల గురించి డైరీలో వివరించిన బాధితురాలు
- తన శవాన్ని భర్తను తాకనివ్వొద్దని వేడుకోలు

ఏకాంతంగా గడిపిన దృశ్యాలను సెల్‌ఫోన్లో రికార్డు చేసి బ్లాక్‌మెయిల్‌కి పాల్పడేవాడు.

**వైద్యులు పొరపాటున ఎయిడ్స్ వ్యక్తి యొక్క రక్తం ఎక్కించటం వలన, ఎయిడ్స్ వ్యాధి రావటం, భర్త అనుమానించి విడాకులు ఇవ్వటం.**

## Shocking: సోషల్ మీడియాలో మహిళ స్నానం చేసే వీడియో.. భర్తే నిందితుడు..

సోషల్ మీడియా లో పేరు సంపాదించటం కోసం....

## Crime news : మద్యం తాగొచ్చి కూతుర్ని కాటేసిన తండ్రి ..

**ప్రేమను ఒప్పుకోలేదని మొహంపై యాసిడ్ పోయటం**

## ఐటీ కంపెనీలో ఉద్యోగం.. మహిళా సహోద్యోగి టార్చర్.. మేనేజర్ ఏంచేశాడంటే..

పూర్తి వివరాలు.. హర్యానాలో (Haryana) షాకింగ్ ఘటన జరిగింది. స్థానికంగా ఉన్న గురుగ్రామ్ లోని బహుళ జాతి కంపెనీ ఉద్యోగి అమిత్ కుమార్ (40), 4 పేజీల సూసైడ్ నోట్ రాసి మరీ ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ ఘటన తీవ్ర కలకలంగా మారింది. రవినగర్ కాలనీకి చెందిన అమిత్ కుమార్, సాఫ్ట్ వేర్ కంపెనీలో అసిస్టెంట్ మెనేజర్ గా పనిచేస్తున్నాడు. అయితే.. అతని టీమ్ లో ఒక మహిళ ఉద్యోగితో గొడవ జరిగింది. ఇద్దరి మధ్య తీవ్ర వాదనలు జరిగాయి.ఈ క్రమంలో.. అతనిపై కొంచెం చెడుగా రూమర్స్ స్ప్రెడ్ అయ్యాయి. దీంతో అతను తీవ్ర మనస్తాపానికి గురయ్యాడు. దీంతో అతను భరించలేక.. ఉరివేసుకుని ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

# మీకు ఏది ఇష్టం?




1గంటలో recovery అవ్వటం ఇష్టమా? 1రోజులో recovery అవ్వటం ఇష్టమా?

1నెలలో recovery అవ్వటం ఇష్టమా? 1సంవత్సరంలో recovery అవ్వటం ఇష్టమా?

జీవితాంతం బాధపడటం ఇష్టమా?

Part -1

# రక్షణ కావాలా? వద్దా?



ముతికి నుంచి బూట్స్ ఎలా రక్షణ ఇస్తాయో...



వర్షం నుంచి కోట్ ఎలా రక్షణ ఇస్తుందో



వైరస్ నుంచి PPE కిట్ ఎలా రక్షణ ఇస్తాయో









బాణం నుంచి రక్షణ కోసం షీల్డ్

ముతికిలో తిరుగుతున్నా ముతికి ఎలా అంటదో, వైరస్ ప్రపంచంలో తిరుగుతున్నా వైరస్ ఎలా అంటదో, వర్షంలో తిరుగుతున్నా వర్షం ఎలా అంటదో,
అలా కలియుగంలో ఒత్తిడి, అసంతృప్తి లేకుండా జీవించటం అసాధ్యం! కానీ బ్రహ్మ భావనతో జీవిస్తే అది అంటదు!



Part -1

# కాలంతో పాటు క్రొత్త విధానాలు వస్తున్నాయి

(వేగంగా, వెంటనే, automatic, అనుకొన్న విధముగా, సులభంగా అర్ధం చేసుకోవటం, సులభంగా ఉపయోగించటం)

(నష్టం తక్కువ, శ్రమ తక్కువ, కష్టం తక్కువ, ఇబ్బంది తక్కువ, ఫలితాలు ఎక్కువ)





ఆహారం తయారుచేసే విధానంలో మార్పులు





మాట్లాడుకొనే విధానంలో మార్పులు





ప్రయాణించే విధానంలో మార్పులు





యుద్ధ విధానంలో మార్పులు

ఆలోచనలను కూడా వేగంగా,సమర్ధవంతంగా కంట్రోల్ చేయటానికి కూడా ఒక విధానం భగవంతుడు సృష్టించడా??

అవును, అదే ఆత్మ జ్ఞానం/బ్రహ్మ జ్ఞానం. కాకపోతే ఇది క్రొత్తగా వచ్చినది కాదు. సృష్టితో పాటు ఉంది, కానీ కాలంతోపాటు చెప్పే విధానంలో మార్పులు జరుగుతూ వస్తుంది. అంటే సులభంగా, వెంటనే అర్ధం అయ్యేలా చెప్పటం.

Part -1

# ప్రస్తుత జ్ఞానం

వీధిలో ఉంటే ఎక్కడ ఉన్నామో, ఎంత ప్రయాణం చేశామో గుర్తించటం కష్టం
(ఆత్మ జ్ఞానం తెలియకపోతే సృష్టి గురించి, నీ గురించి తెలియక ఇబ్బందిపడతాము)



మొదటిసారి ఒక ప్రదేశం నుంచి మరోచోటికి వెళ్ళాలంటే...
Map ఉంటే, ఎక్కడ ఉన్నాము, ఎంత ప్రయాణం చేశామో తెలుసుకోవచ్చు
(ఆత్మ జ్ఞానం వలన సృష్టి గురించి, నీ గురించి స్పష్టత వస్తుంది)




## ప్రస్తుత జ్ఞానం

(కప్పకు బావి లోపల ఉండటం వలన క్రొద్దిపాటి జ్ఞానం మాత్రమే)



## ఆత్మ జ్ఞానం తెలుసుకొంటే ....

(గ్రద్దకు పై నుంచి చూడటం వలన భూమి ఎంత ఉంది, నేను ఎక్కడ ఉన్నాను అనే స్పష్టత ఉంటుంది)



Part -1

# అసంతృప్తికి కారణాలు

- టెక్నాలజీ పెరిగేకొంది ఆకర్షించేవాటిని సులభంగా తెలుసుకోగలగటం, చూడటం వలన, వాటిని పొందాలి, అనుభవించాలి అనే కోరిక పెరిగి, దానిని పొందలేక, సామర్థ్యం లేక, అసంతృప్తి కలిగి, బాధ, దుఖం, నిరాశతో కూడిన ఆలోచనలు కలగటం.
- సమస్య వస్తే సరైన ధైర్యం చెప్పేవారు లేక, ఆలోచనలను అదుపుచేసుకోలేక ఆత్మహత్య, హత్య చేయటం, మానసిక సమస్యలతో బాధపడుతున్నారు.
- తొందరగా అనుభవించాలి అందుకోసం విలువలు, ధర్మాలు పాటించటం తగ్గిపోవటం వలన, వచ్చే భయం, ఆందోళన, ఒత్తిడి తట్టుకోలేకపోవటం వలన ఆలోచనలు పెరగటం.
- అతి మమకారం, అతి ప్రేమ, అతి కోరికలు, అతి పోలిక






Part -1

# ఆత్మ జ్ఞానం(బ్రహ్మ జ్ఞానం) ఎందుకు తెలుసుకోవాలి?

- బాధ, దుఃఖం, అసంతృప్తి, నిరాశతో వచ్చే ఆలోచనలను సమర్ధవంతంగా ఎదుర్కోవటం ఎలా?
- నేను ఎవరు? ఈ సృష్టి ఏమిటి? ఎందుకు వచ్చింది? నా పాత్ర ఏమిటి?
- కొందరు కష్టంలో ఆనందంగా ఉండగలరు, కొందరు ఎందుకు ఉండలేరు?
- ఎప్పుడూ ఆనందంగా/సంతృప్తితో ఉండాలంటే ఎలా?
- భయాన్ని జయించలేమా? ఎప్పుడూ ధైర్యంగా ఉండాలంటే ఎలా?
- విపరీతంగా కలిగే కోరికలు ఎలా ఆగిపోతాయి? శాశ్వతంగా ఎలా తీసివేయాలి?
- నన్ను నేను తెలుసుకోవటం ఎలా?
- మోక్షం(జన్మ రాహిత్యం) పొందటం ఎలా?




ఆత్మ జ్ఞానం/బ్రహ్మ జ్ఞానం అనేది సైన్స్, సోషల్ సబ్జెక్టు లాంటిదే! ఇంకా చెప్పాలంటే దానికంటే చాలా సులువైనది. ఇది తెలుసుకొంటే ఆలోచనల తీవ్రత కొంతసేపటికి తగ్గించవచ్చు

ఈ కోర్స్ లో మన దృష్టి అంతా ఆలోచనలను ఎలా కంట్రోల్ చేయటం అనేదే ప్రధానంగా చూడాలి.ఈ జ్ఞానం నేర్చుకొంటే షుగర్ తగ్గుతుందా, ప్రమోషన్ వస్తుందా, పిల్లలకు పెళ్లి అవుతుందా? అనేది కాదు.



## KGF చూసి ఫేమస్ అయ్యేందుకు 4గురిని హత్య చేశాడు

మధ్యప్రదేశ్(Madhyapradesh) రాష్ట్రంలోని సాగర్ కు చెందిన శివప్రసాద్ (19)కు సినిమాల పిచ్చి. విపరీతంగా సినిమాలు చూసేవాడు. అయితే కన్నడ స్టార్ హీరో యశ్ నటించిన కేజీఎఫ్ సినిమా చూసి స్ఫూర్తి పొందిన శివప్రసాద్.. సినిమాలో మాదిరిగానే నేరాలు చేస్తూ ఫేమస్ అయిపోవాలని అనుకున్నాడు. . నిద్రిస్తున్న సెక్యూరిటీ గార్డులే లక్ష్యంగా దారుణమైన హత్యలకు పాల్పడడం మొదలుపెట్టాడు. SEPTEMBER 03, 2022, 17:25 IST



Part -1

# ఎందుకు చిత్రముల ద్వారా ఆత్మజ్ఞానాన్ని చెప్పడాన్ని ఎంచుకొన్నాను?

అక్షరం(పుస్తకం)(1) →మాట (ప్రవచనం )(100) →చిత్రం(PPT)(1000) →B/W వీడియో(10000) --> Colour వీడియో(100000 ) →3D వీడియో(1000000)

బాహుబలి కథను స్టోరీ ద్వారా కంటే, సినిమా ద్వారా అయితే ఎక్కువ అర్థం అవుతుంది, ఎక్కువ కాలం గుర్తుండి పోతుంది?




సూక్తిని(Quote) మాట ద్వారా చెప్పటం కంటే చిత్రం ద్వారా చెప్తేనే ఎక్కువ అర్థం అగును కదా?

అదేమన్నా బ్రహ్మ విద్యా? అనే ఊతపదం ప్రపంచంలో ఉంది, ఆ పదం వింటేనే నేర్చుకోవటానికి భయపడుతున్నారు.

మరి బ్రహ్మ విద్యను సులభంగా అర్థం అయ్యేలా చెప్పటం ఎలా? చిత్రముల(Picture) ద్వారా

# Part -2
# సిద్ధాంతము / Theory

**ఆత్మ జ్ఞానం/బ్రహ్మ జ్ఞానం**

**1**

ఆత్మ/బ్రహ్మం/దేవుడు అంటే ఏమిటి?

(సర్వ శక్తి + సర్వ విజ్ఞత + సర్వ వ్యాప్తం నిరాకారం)

**2**

ఆత్మ/బ్రహ్మం/దేవుడు యొక్క సహజ ధర్మం ఏమి?

( సృష్టి, స్థితి, లయం )

**3**

ఆత్మ/బ్రహ్మం/దేవుడు సహజ ధర్మాన్ని ఎలా నడిపిస్తుంది?

(కర్మ)

**Part -2**

# జీవించాలంటే ఏమైనా User Manual/User Guide ఉందా?

## రిఫ్రిజరేటర్ ఎలా వాడాలి?

Refrigerator User Manual







## భూమి మీద ఎలా జీవించాలి?






అహం బ్రహ్మాస్మి - నేను బ్రహ్మమును, బ్రహ్మమే నేను

అయం ఆత్మా బ్రహ్మ - ఈ ఆత్మయే బ్రహ్మము

తత్వమసి - నీవు కూడా బ్రహ్మమే/నీవే అది అయి ఉన్నావు

సర్వం ఖల్విదం బ్రహ్మ - జగత్తు బ్రహ్మమే

సాధారణంగా ఒక వస్తువు కొన్నప్పుడు ఎవరు తయారుచేశారు? ఎలా వాడాలి? సమస్య వస్తే ఎవరిని సంప్రదించాలి?
అని తెలుసుకొంటాము, అదే User Manual/User Guide. కానీ విచిత్రం ఏమిటంటే పుట్టిన తర్వాత
ఈ సృష్టిని ఎవరు తయారు చేశారు? ఈ సృష్టిలో ఎలా ఉండాలి? ఎలా జీవించాలి? సమస్య వస్తే ఎవరిని అడగాలి?
ఈ భూమి మీద జీవించాలంటే ఏమైనా User Manual/User Guide ఉందా? అని ఏమీ తెలుసుకోకుండానే ఉపయోగిస్తున్నాము.

| ఫ్రీజ్(రిఫ్రిజరేటర) వస్తువు కొన్నప్పుడు | సృష్టిని ఉపయోగిస్తున్నప్పుడు |
|---|---|
| Q: దేనికోసం ఈ వస్తువు తయారుచేయబడింది?<br>A: పదార్థాలను చల్లబరచటం వలన, దానివలన ఎక్కువ రోజులు నిల్వ ఉండటం కోసం. | Q: ఎందుకోసం ఈ సృష్టి తయారుచేయబడినది?<br>A: సర్వ శక్తి, సర్వ విజ్ఞత, సర్వ వ్యాప్త, సర్వకాలములందు ఉండే "నేను/ఆత్మ" యొక్క సృష్టి, స్థితి, లయ ధర్మం కోసం |
| ఏ కంపెనీ?<br>LG | ఎవరు తయారు చేశారు? ఎవరు సృష్టి చేశారు?<br>సర్వ శక్తి, సర్వ విజ్ఞత, సర్వ వ్యాప్త, సర్వకాలములందు ఉండే "నేను / ఆత్మ" |
| ఏ దేశం వాళ్ళది? ఆ కంపెనీ ఎక్కడ?<br>దక్షిణ కొరియా | వారు ఎక్కడ ఉంటారు?<br>సర్వ వ్యాప్త ముగా అంతటా వుంటాను |
| ఈ వస్తువు జీవితకాలం ఎంత?<br>14 సంవత్సరాలు | ఎంతకాలం ఈ సృష్టి ఉంటుంది?<br>సృష్టి నిరంతరంగా జరుగుతూ ఉంటుంది, కానీ ఈ దివ్య యుగం అంటే 4 యుగాల(సత్యయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, కలియుగం) మొత్తం వయస్సు 43,20,000 సంవత్సరాలు. అందులో కలియుగ వయస్సు 4,32,000 సంవత్సరాలు, అందులో ఇప్పుడు 5122 సంవత్సరంలో ఉన్నాము. |
| ఎలా వాడాలో తెలియచేసే ఏదైనా user manual/user guide ఉందా?<br>ఫ్రీజ్ తో పాటు ఎలా ఉపయోగించాలో తెలియచేసే గైడ్ ఇచ్చారు. | ఈ సృష్టిలో ఎలా ఉండాలో, ఈ సృష్టిని ఎలా వాడుకోవాలో తెలియచేసే ఏదైనా user guide ఉందా?<br>వేదాలు, ఉపనిషత్ |

Part -2

# 1.ఆత్మ/బ్రహ్మం/దేవుడు అంటే ఏమిటి?



ఆత్మ = సర్వ శక్తి + సర్వ విజ్ఞత + సర్వ వ్యాప్త + నిరాకారం



ఆత్మ యొక్క సర్వ శక్తి,
సర్వ విజ్ఞత వలన సృష్టి
వస్తుంది,పోతుంది, కానీ
ఆత్మలో మార్పు లేదు

ఆత్మ సహజ లక్షణం: సర్వ శక్తి, సర్వ విజ్ఞత, సర్వ వ్యాప్తం

సర్వ వ్యాప్తం



సర్వ వ్యాప్తం

సర్వ వ్యాప్తం

ఈ గేలక్సీ/సృష్టి లు అన్నీ కూడా ఆత్మ కి ఉన్న సహజ గుణం అయిన సర్వ శక్తి,
సర్వ విజ్ఞత నుంచి వచ్చినవే! అంటే సహజ ధర్మం/Duty వలన ఏర్పడినవి.




ఇక్కడ నీవు ఉన్నావు

( కొన్ని కోట్ల పాలపుంతలు ఉంటే, అందులో ఒక పాలపుంతలో ఒక చోట భూమి ఉంటే, అందులో
ఒక దేశంలో గల ఊరిలో నీవు ఉన్నావు! )

నీరు = ద్రవరూపం, పారదర్శకత(రంగులేదు), రుచి లేదు

నీరు అంటే = H2o = 2 హైడ్రోజన్ + 1 ఆక్సిజన్



నీరు సహజ లక్షణం: ద్రవరూపం, పారదర్శకత(రంగులేదు), రుచి లేదు

నీరు



నీరు

నీరు

ద్రవరూప లక్షణం వలన నీటి
అల, నీటి చుక్కలు ఏర్పడినాయి.
ద్రవరూప లక్షణం వలన అల
పుట్టటం, పోవటం జరుగును.
నీరు మాత్రం అలాగే ఉంటుంది.

ఈ నీటి చుక్కలు అన్నీ కూడా నీటికి ఉన్న సహజ
గుణం అయిన ద్రవ లక్షణం నుంచి వచ్చినవే!




| బ్రహ్మ కణం/అణువు | హైడ్రోజన్ కణం/అణువు |
|---|---|
| సర్వ శక్తి | పరిమిత శక్తి |
| సర్వ విజ్ఞత | పరిమిత విజ్ఞత |
| సర్వ వ్యాప్తం | పరిమిత ప్రదేశం |
| సృష్టి, స్థితి, లయ ధర్మం | ద్రవరూపం, పారదర్శకత,స్వచ్ఛత, చలనం,ఆవిరి, గడ్డ కట్టు ధర్మం |

సర్వ శక్తి, సర్వ విజ్ఞత గల కణం





సర్వ శక్తి, సర్వ విజ్ఞత గల కణాలు












ప్లాస్టిక్ కణాలు నుంచి ప్లాస్టిక్ పదార్థం, దానినుంచి ప్లాస్టిక్ బొమ్మలు చేసినట్టు, అంటే ఇక్కడ ఉన్న మనిషి, చెట్లు, కార్లు, ఇల్లు అన్నీ ప్లాస్టిక్ తో తయారుచేస్తే, ఏది ముట్టుకున్నా ప్లాస్టిక్. కానీ రూపం వేరు. అలాగే సర్వ శక్తి, సర్వ విజ్ఞత గల బ్రహ్మమే ఈ సృష్టిలో గల గాలి,నీరు, మనుష్యులు,వస్తువులు,భూమి రూపంలో ఉంది. అంటే ఏది ముట్టుకున్నా ప్లాస్టిక్ ఎలానో, ఏది ముట్టుకున్నా బ్రహ్మమే!.

Part -2

# బ్రహ్మ కణాలకు సర్వ శక్తి, సర్వ విజ్ఞత ఉందని ఎలా నమ్మాలి?






పరిమిత శక్తి, పరిమిత విజ్ఞత కి ఉదాహరణ










**భరద్వాజ మహర్షి:** శ్రీరామ చంద్రుడిని ఒప్పించటానికి భరతుడు తన సైన్యంతో వెళుతున్నప్పుడు దారిలో వారికి ఆతిథ్యం ఇవ్వడానికి తన ఆశ్రమం సరిపోదు కాబట్టి తన తపశ్శక్తిచే తన పరిసరాలను ఒక్క క్షణంలో  పెద్ద భవనాలు, సరస్సులు, ఆహార పదార్థాలు, లక్షల పరిచారికలు సృష్టించాడు.
**సాయిబాబా:** తన ఛట్కాతో నేలమీద కొడితే నీరు, నిప్పు వచ్చింది. బావిలో పూలు వేస్తె ఉప్పు నీరు, మంచి నీరుగా మారుట.
**శ్రీకృష్ణుడు:** బ్రహ్మగారు గోపబాలురను, గోవులను మాయ చేస్తే, శ్రీకృష్ణుడు ప్రతి సృష్టి చేసి గోపబాలురుగాను, గోవులుగాను వారి వారి వ్యక్తిత్వాలగాను ప్రవర్తిస్తాడు.

**Note: మన చుట్టూ ఉన్న గాలి, నీరు, మట్టి, గడ్డి, చెట్లు, వస్తువులు, వ్యక్తులు అనేవి సృష్టి ధర్మంలో భాగంగా ఇప్పుడు ఆ రూపంలో బ్రహ్మమే ఉంది, కావున చులకన చేయరాదు. అది తలచుకొంటే(బ్రహ్మం అయితే) ఏ రూపం అయినా అవ్వగలదు!**

వెంకటేశ్వర స్వామి స్వయంభూ గా ఎలా మారగలిగినారు?
(శరీరం → రాయి గా ఎలా మారగలిగింది? )





బ్రహ్మం/దేవుడు అన్నిట్లో ఉంది అని చెప్పే ఉదాహరణ



Part -2

# 2. ఆత్మకు/బ్రహ్మంకు కూడా సహజ ధర్మం ఉంది

- సృష్టిలోని ప్రతిదానికి ఒక సహజ ధర్మం(duty)/ సహజ లక్షణం ఉంది.
- అంటే చెట్టు నీడనివ్వాలి, పండ్లు నివ్వాలి, కొట్టివేసినప్పుడు చెక్క ఇవ్వాలి. దానినే చెట్టు అంటారు.
- అలాగే ఫ్యాన్ తీసుకొంటే అది తిరగాలి, గాలి ఇవ్వాలి. దానినే ఫ్యాన్ అంటారు.
- సూర్యుడు వెలగాలి, కాంతి ప్రసరించాలి, ఎండ భూమి మీద పడాలి. దానినే సూర్యుడు అంటారు.
- మనిషికి కూడా ధర్మం ఉంది, మాట్లాడాలి, పని చేయాలి, సంపాదించాలి,కుటుంబాన్ని పోషించాలి
- నీటికి కూడా ధర్మం ఉంది, గట్టకట్టడం, ఆవిరి అవ్వటం, పారదర్శకత, స్వచ్ఛత, చలనం....







లాజిక్

సూర్యుడు,కాంతి వేరు వేరా? రెండు ఒకటేనా?

చెట్టు,కాయ వేరు వేరా? రెండు ఒకటేనా?

# Part -2 ఆత్మ/బ్రహ్మం యొక్క ధర్మం(సహజ లక్షణం) = సృష్టి చేయటం, స్థితి చేయటం, లయం చేయటం

LIFE OF BRAHMĀ
311.04 trillion years (36,000 *kalpas* [days of Brahmā] and an equal number of nights)
creation
full devastation
partial creation
partial devastation
KALPA (day of Brahmā)
4.32 billion years (14 *manvantaras* + 15 *sandhyās*)
night is the same length
night
night
*sandhyā*, or juncture
1.728 million years
(partial creation)
*sandhyā*
1.728 million years
(partial devastation)
MANVANTARA
306.72 million years (71 *divya-yugas*)
DIVYA-YUGA
4.32 million years (4 *yugas*)
*sandhyās*
Satya-yuga
(1.728 million years)
Tretā-yuga
(1.296 million years)
Dvāpara-yuga
(864,000 years)
Kali-yuga
(432,000 years)




అటు ఇటుగా... చతుర్ముఖ బ్రహ్మగారి 1నిమిషంలో ఒక దివ్య యుగం(43లక్షలు సంవత్సరాలు) గడిచిపోతుంది.

అలాగే మనిషి 1 నిమిషంలో 120million కొత్త రక్త కణాలు తాయారు అవుతాయి.

బాక్టీరియా, కణాలతో పోల్చుకొంటే మనిషి జీవిత కాలం ఎక్కువ. మనిషి ఒక రోజులో ఎన్నో బాక్టీరియాలు పుడుతున్నాయి, చనిపోతున్నాయి

Part -2

# యుగాంతం తర్వాత




పుణ్యం చేసుకొనేకొంది మనిషి జన్మ - పాపం చేసుకొనేకొంది చెట్లు, పక్షి, జంతు, వస్తువు జన్మ(వనరులు)

స ఈక్షత ఇమే సు లోకాః
లోకపాలన్ను సృజా ఇతి – ఐతరేయ ఉపనిషత్ – ప్రధమ ఖండం శ్లోకం 3
ప్రాణులు తమ కర్మ ఫలములను అనుభవించుటకు శరీరములు, లోకములు కావలయును అందుకు సృష్టి జరిగెను

# Part -2 ఈ విశ్వంలో ఎన్నో సృష్టులు ఉన్నాయి, అందులో ఒకదానిలో మనం ఉన్నాము



Part -2

# సృష్టి ధర్మం జరగాలంటే కొంచెం అజ్ఞానం/మలినం కావాలి

సుద్ద బంగారాన్ని వస్తువు చేయాలంటే కష్టం, కాస్త మలినం అయిన రాగి కలుపుతారు. అప్పుడే అది మనకు కావలసినట్టు వంగుతుంది. రూపం వస్తుంది!




రూపం పొందలేదు






2% రాగి కలపటం వలన వస్తువు రూపం పొందును



రూపం రావాలంటే →కఠినం కావాలి →మలినం కలపాలి

సృష్టి ధర్మం జరగాలంటే → రూపం కావాలి.
రూపం రావాలంటే → అజ్ఞానం/మలినం కావాలి.
అజ్ఞానం /మలినం కలగాలంటే → నేను బ్రహ్మం అని మరచిపోవాలి!
నేను బ్రహ్మం అని మరచిపోవాలంటే → రజో, తమో గుణాలు కావాలి!
రజో, తమో గుణాలు కావాలి అంటే → యోగ మాయ సహకారం కావాలి!

అంటే బ్రహ్మమే సహజ ధర్మం అయిన సృష్టి(రూపం) కోసం తనకు తాను అజ్ఞానాన్ని ప్రదర్శించుకోవాలి. ఇదంతా కూడా బ్రహ్మం యొక్క యోగ మాయ శక్తి అయిన సత్ రజో తమో గుణాల వలన సృష్టి వచ్చింది. సృష్టిలో మూడొంతులు సృష్టి జరగలేదు, ఒక వంతు మాత్రమే! ఇదంతా వేదాంత పంచదశి అనే గ్రంధంలో లో వివరంగా చెప్పబడింది. సృష్టి అంటేనే నామం, రూపం కలిగినది.

అలా సృష్టి నిరంతరం జరగాలంటే అజ్ఞానం ఉండాలి. దాని వలన అహంకారం, మమకారం వలన వాసనలు కలిగి జన్మ వస్తుంది. బ్రహ్మం తనకు తనే అజ్ఞానం కలిగించుకొని, తనే జన్మ ఎత్తుతూ. తన ధర్మాన్ని బ్రహ్మం చేస్తుంది!

సముద్రపు ఒడ్డున పిల్లలు ఇసుకతో ఒక గూడు కట్టుకొని(సృష్టి), కాసేపు ఆటలాడుకొని(స్థితి), చివరలో ఇంటికి వెళ్ళిపోతూ ఆ గూడుని పగలకొట్టి(లయం) చేసి వెళతారు. అదేవిధముగా ఈ సృష్టి ధర్మం జరుగును. నన్ను నేను సృష్టించుకొని, కాసేపు నాతో ఆడుకొని, వెళ్తూ వెళ్తూ నన్ను నేను చంపేసుకోవటం. అలాగే సాలెపురుగు నోటితో గూడు అల్లి, కొంతకాలం వుండి, గూడుని నాశనం చేసుకొన్నట్లు!

Part -2

# మనం బ్రహ్మం అని ఎందుకు మరచిపోతున్నాము?

మాయ అధీనంలో ఉన్న బ్రహ్మం => జీవుడు




యోగ మాయ

సూక్ష్మ శరీరం

స్థూల శరీరం

**కారణ శరీరం:** అనేది ఆత్మకి దగ్గరగా ఉంటుంది. ఇందులో సత్, రజో, తమో గుణాలు వుంటాయి. సృష్టి నడచుటకు ప్రధాన కారణం.

1.తమో గుణం వలన - ఇది మోహం కలిగిస్తుంది, అంటే శరీరమే నేను అనే బ్రమ కలిగిస్తుంది,
తాను బ్రహ్మం అనే విషయం మరచేలా చేస్తుంది. గురువు, శాస్త్రం చెప్పిననూ నిజమో కాదో అనే అనుమానం కలిగేలా చేస్తుంది.
దీనివలన బ్రహ్మమే కర్మ చేస్తున్నప్పటికీ, శరీరమే చేస్తుంది అని కర్మ ఫలాన్ని శరీరంపై వేసుకోవటం వలన పుణ్యం/పాపం కలిగి జన్మ ఎత్తుతుం

2.రజో గుణం వలన – విక్షేప శక్తి కలుగును. అంటే రాగ ద్వేషములు, సుఖం-దుఃఖం, స్వార్ధం, ప్రేమ, దయ, సంతోషం, విచారం, తృప్తి, అసంతృప్తి, విషయ వాసన, క్రోధం, లోభం, మొహం, మదం, మత్సరం కలిగించును.

3.సత్ గుణం - ఇది దేవతలలో, కారణ జన్మలలో, జీవన్ముక్తులలో మాత్రమే ఉంటుంది.

------------

కారణ శరీరం వలన వాసనలు వస్తున్నవి:

దేహ వాసన – ఈ శరీరమే దేహం, దీనిని అందంగా, ఆరోగ్యంగా, సుఖంగా వుంచుకోవాలనే కోరిక
కర్తృత్వ వాసన – నేను ఇల్లు కట్టుచున్నాను, నేను వ్రాయుచున్నాను
ధన వాసన – శరీరాన్ని సుఖపెట్టుటకు ధన సంపాదన కోరిక
స్త్రీ వాసన – స్త్రీల యందు అనురక్తి
కీర్తి వాసన – పేరు ప్రతిష్టలు పొందాలనే అనురక్తి, ఈ శరీరాన్ని అందరూ గుర్తించాలనే కోరిక
శాస్త్ర వాసన – పుస్తకాలను చదవాలనే కోరిక
లోక వాసన – విషయాల పట్ల, లోకం పట్ల జ్ఞానం పొందాలనే కోరిక

**కర్మ = తమో గుణం(నేను శరీరం అనే బ్రమ)+ రజో గుణం (రాగ ద్వేషములు) => పాపం/పుణ్యం వస్తుంది => జన్మ**




బ్రహ్మం




కారణ జన్ముడు/శ్రీకృష్ణుడు




మనిషి/జీవుడు

# Part -2 బ్రహ్మం తన ధర్మాన్ని నిర్వహించుటకు చతుర్ముఖ బ్రహ్మ, విష్ణు, శివ ప్రతినిధులుగా ఉంది




బ్రహ్మ - సృష్టి చేయటానికి జ్ఞానం కావాలి కాబట్టి - సరస్వతి దేవిని భార్యగా

విష్ణు - స్థితి చేయుటకు ఐశ్వరం కావాలి కాబట్టి - లక్ష్మి దేవిని భార్యగా

శివుడు - నాశనం చేయటానికి శక్తి కావాలి కాబట్టి - పార్వతి దేవిని భార్యగా అవతారం తీసుకొన్నారు

బ్రహ్మ, విష్ణు, శివ అనేవి పదవులు, వ్యక్తుల పేర్లు కాదు!

ప్రళయం లో ఒక బ్రహ్మ తర్వాత మరో బ్రహ్మ వస్తాడు, అలా విష్ణువు, శివ కూడా మారతారు!

మగ వ్యక్తి కుటుంబ యజమానిగా ఒక ధర్మం చేస్తున్నాడు, ఆఫీస్ లో తన యజమాని చెప్పినట్లు ఉద్యోగిగా ఒక డ్యూటీ చేస్తున్నాడు, ఇంట్లో పిల్లలకు తండ్రిగా మరో డ్యూటీ చేస్తున్నాడు, భార్యకు భర్తగా మరో డ్యూటీ చేస్తున్నాడు, కొడుకుగా తల్లిదండ్రులకి ఇంకో డ్యూటీ చేస్తున్నాడు... మరి ఇన్నిరకాల వ్యక్తులు ఉన్నారా? ఉన్నది ఒక్కడే కదా!

అలాగే ఒకటే ఆత్మ → బ్రహ్మ, విష్ణు, శివునిగా ఉంది

గవర్నమెంట్ ని మనం చూడలేము, కానీ దాని ప్రతినిధిని చూడొచ్చు. అంటే ప్రధాన మంత్రి, ఆర్థిక మంత్రి, విద్యా మంత్రి.
ఒక ప్రధాన మంత్రి, ఆర్థిక మంత్రి, విద్యా శాక, రక్షణ మంత్రి నిర్వహణ చేసేవారి పదివీకాలం అయిపోతే, ఇంకొక మంత్రి వస్తారు.

# సృష్టి ధర్మం ఎలా మొదలైంది?

సృష్టిక్రమంలో భాగంగా చతుర్ముఖ బ్రహ్మ భూమిని సృష్టించిన తర్వాత ప్రజాపతులను సృష్టించాడు.
అందులో దక్షునికి 60మంది కుమార్తెలు జన్మించగా, వారిలో 8మందిని కశ్యపునికి వివాహం చేస్తాడు.
కశ్యప ప్రజాపతికి-దితి కి రాక్షసులు జన్మించగా,
కశ్యప ప్రజాపతికి-అదితికి దేవతలు జన్మిస్తారు.
కశ్యప ప్రజాపతికి-మను కి పుట్టినవారే మనుష్య జాతి





"సర్వ వ్యాప్త నేను"

(ఆత్మ)

(భగవంతుడు)




నిజ స్థితి (బంగారం) ⇨ అజ్ఞానం అనే రాగి (మాయ) ⇨ రూపం




నిజ స్థితి ⇨ రుచి--> రావటానికి ఉప్పు, రూపం-->రావటానికి నూనె/నీరు, వేడి చేయటం వలన-->గట్టిదనం ⇨ రూపం



## Part -2 సృష్టి ధర్మం కొనసాగాలంటే "ఆకర్షణ" కల్పించాలి, లేకపోతే బోర్ వస్తుంది

సృష్టి నడవాలంటే -> కర్మ చేయాలి, కర్మ చేయాలంటే ->కోరిక కలగాలి, కోరిక కలగాలంటే ->ఆకర్షించే సృష్టి ఉండాలి



ఎవరైనా ఇలాంటి ఎడారులలో, గ్రహాలలో లక్షల సంవత్సరాలు జీవించటానికి ఇష్టపడతారా? విరక్తి, విసుగు కలుగును

సినిమా డైరెక్టర్ నోటితో కథను చెపితే ప్రేక్షకులు అది నిజమని భ్రమించలేరు. దానికి బాగా నటించేవారి చేత ఆహాభావాలు వ్యక్తీకరించితే, దానికి సరైన సౌండ్ ఎఫెక్ట్స్ జోడిస్తే అప్పుడు ప్రేక్షకుడిని అది నిజం అని "భ్రమ" కలిగేలా చేయును, అప్పుడు ఆ ప్రేక్షకుడు ఏడుస్తాడు, నవ్వుతాడు, మళ్ళీ మళ్ళీ సినిమా చూస్తాడు. బాహుబలి కథ నోటితో చెప్తే ఎన్నిసార్లు వింటారు? గ్రాఫిక్స్ తో సినిమాగా చూపిస్తే ఎన్నిసార్లు చూస్తారు???

అలా మనిషిని ఎడారిలో ఉండమంటే ఆసక్తి చూపించడు, అందుకోసం 84లక్షల జీవరాసులు ఉండేలా, లోహాలు భూమిలో ఉండేలా చేసి, వాటితో అందమైన వస్తువులు, పదార్థాలు, భోగాలు, విలాసాలు ఏర్పాటుచేసుకోని వాటిని ఈ జన్మలో అనుభవించలేము కాబట్టి, కోరికలు పెట్టుకొని వాటిని తీర్చటం కోసం మళ్ళీ మళ్ళీ జన్మలు పొందుతున్నారు.



## Part -2 సృష్టిని ముందుకు తీసుకువెళ్లాలంటే బ్రహ్మం అహంకార మమకారాలు(అజ్ఞానం) ప్రదర్శించుకోవాలి

బంగారపు ఆభరణం(రూపం) తయారు అవ్వాలంటే, 2% రాగి కలపాలి

- దానివలన శాపాలు, వరాలు, అవతారాలు రావటం జరుగుతుంది.
- సృష్టిలో ధర్మాన్ని సరిదిద్దటానికి అవతరించాలంటే ఒక రూపం కావాలి అందుకోసం ఒక కోరిక/కర్మ కావాలి.
- ఆ కోరిక కావాలి అంటే శాపమో, వరమో, అహంకారమో, మమకారమో కావాలి.
- అందుకోసం అప్పుడప్పుడు బ్రహ్మం అహంకరిస్తున్నట్లు, మమకారం ప్రదర్శిస్తున్నట్లు కనపడుతుంది.
- ఇది అంతా కూడా సృష్టి ధర్మం/డ్యూటీ సజావుగా చేయటానికే తప్ప, బ్రహ్మానికి అహంకారం, మమకారం లేదు.
- అందుకోసం బ్రహ్మం, బ్రహ్మాన్ని(ఒక దేవుడు,మరో దేవుణ్ణి) శపించటం, వరాలు ఇవ్వటం జరుగుతుంది.
- ఈ సత్యం తెలియనివారు దేవుడు కూడా తప్పులు చేస్తున్నాడు అనుకోవటం, ఈ మాత్రం కూడా తెలియదా! అని అనుకోవటం జరుగును.

Example: సృష్టిధర్మం సక్రమంగా జరగాలి అంటే లోకానికి ధర్మం-అధర్మం అంటే ఏమిటో ప్రాక్టికల్ గా చేసి చూపించాలి అందుకోసం జయ-విజయులు శాపం పొందటం, వారు రాక్షసులుగా 3జన్మలు ఎత్తుతాము అని కోరుకోవటం, వారిని చంపే ఉద్దేశ్యంతో లోకానికి ధర్మం-అధర్మం ఆచరణలో చూపించటం కోసం రామ, శ్రీకృష్ణ, నరసింహ అవతారం.

Example: శివుడు, తెలియక, అజ్ఞానంతో తన కొడుకు అని గుర్తించక వినాయక స్వామి యొక్క తల నరికాడు అంటే అంతటి అమాయకత్వం మరొకటి లేదు. సర్వ శక్తి, సర్వ విజ్ఞత కలిగిన శివునికి కాపలాగా ఉన్నది తన కొడుకే అని తెలియదా? ఈ చిన్న విషయం తెలియకపోతే శివుడుని దేవుడు అనలేము కదా! శివునికి అన్నీ తెలుసు, కానీ ఏమీ తెలియనట్టు చేశాడు, ఎందుకంటే వినాయక స్వామి అనే అవతారం రావాలి, రాక్షస సంహారం జరగాలి.

Part -2

# సృష్టి ధర్మం చేయటానికి అవతారాలు ఎందుకు?

శరీరంలో ఒక చెడు గడ్డ పుట్టింది, అంటే ఆ గడ్డ ఎవరిది? ఆ శరీరానిదే? అలాగని తీసివేయకుండా వుంచుకొందామా? తీసివేయకపోతే శరీరం అంతా ప్రాకి 100 సంవత్సరాలు బ్రతకాల్సిన వ్యక్తి, 30 సంవత్సరాలకే చనిపోతాడు, అంటే మొత్తం శరీరమే నాశనం అయ్యే ప్రమాదం ఉంది. అంతేగదా?
అప్పుడు ఏమి చేస్తాము, ఆపరేషన్ చేస్తాము. శరీరంలో గడ్డ అనేది నాది అయినప్పటికీ, అది చెడు కాబట్టి నా శరీరం కాపాడుకోవటం కోసం కత్తితో నా శరీరాన్ని కోసి తీసివేయించుకొంటున్నాను. కదా?

అలాగే సృష్టి ధర్మం అనేది 43లక్షల సంవత్సరాలు జరగాలి. కానీ అధర్మం అనేది పెరిగి సృష్టి ధర్మం ముందుకు వెళ్ళకుండా (లేక) అనుకొన్న సమయం కంటే ముందే సృష్టి నాశనం అవుతుంటే, అధర్మం కలిగించే వ్యక్తులు అయినటువంటి నన్ను నేనే చంపుకోవటానికి ఒక అవతారం తీసుకొంటున్నాను. అంటే నన్ను నేనే చంపుకొంటున్నాను.

ఆపరేషన్ చేయించుకోకపోతే శరీరం అంతా ప్రాకి ప్రాణాలు కోల్పోవుట

చెడు గడ్డ

ఆపరేషన్ చేయించుకోవటం వలన ప్రాణాలు నిలబెట్టుకోవడం

Part -2

# శరీర నేను ఎవరు?

సర్వ శక్తి + సర్వ విజ్ఞత + సర్వ వ్యాప్తం

ఆత్మ, బ్రహ్మ,దేవుడు, నేను

ఆత్మ, బ్రహ్మ,దేవుడు, నేను







విశ్వం అంతా => ఆత్మ/బ్రహ్మ/దేవుడు/నేను అయినప్పుడు

గాలక్సీ కూడా => ఆత్మ/బ్రహ్మ/దేవుడు/నేను అవుతారు కదా?

గాలక్సీ కూడా బ్రహ్మం అయితే => అందులో ఉన్న భూమి, జంతువులు, చెట్లు, కారు, కూరగాయలు, బిల్డింగ్, మనుష్యులు కూడా ఆత్మ, బ్రహ్మ,దేవుడు అవుతారు కదా!

So...... శరీరం => కూడా ఆత్మ, బ్రహ్మం, దేవుడు



ఇకనుంచి నేను అంటే శరీర నేను(రామారావు, సుబ్బమ్మ...) కాదు, నేను అంటే బ్రహ్మం, దేవుడు, ఆత్మ అని పిలుచుకుందాం!

Part -2

# 3.ఆత్మ/బ్రహ్మం సృష్టిని ఎలా నడిపిస్తుంది?

## సృష్టి ధర్మాన్ని నిర్వర్తించటానికి/కంట్రోల్ చేయటానికి కర్మ అనేది కొలమానం/నియమం

లాజిక్

### రూపం ఉంది అంటే కర్మ ఉంది.

### ఆ రూపం అనేది పాపం(చెడు), పుణ్యం(మంచి) మీద ఆధారపడి ఏర్పడుతుంది

ఉదాహరణ: ఒక కంపెనీ లో ఉద్యోగులను, ట్రాఫిక్ ని, మొబైల్ ఫోన్స్ ని కంట్రోల్ చేయటానికి ఒక విధానం ఉంటుంది, అలాంటిది సృష్టి మొత్తాన్ని కంట్రోల్ చేయటానికి ఏ విధానం ఉండదా? చాలామంది ఈ సృష్టి అంతా ఏదో యాక్సిడెంట్ గా/అనుకోకుండా జరిగింది అనుకొంటారు, కానీ పక్కా ప్రణాళికతో జరిగింది/జరుగుతుంది అనేది ఇందులో మనం గమనించాలి. మనం అవతలి వారికి ఫోన్ చేసినప్పుడు ఏదో అలా కలిసింది, అనుకొంటాము, కానీ దానివెనుక ఎంతటి పని, సాంకేతికత వుందో మనకు తెలియదు. అన్నీ సక్రమంగా జరగబట్టే మనం అవతలివాళ్ళతో ఏ ఇబ్బంది లేకుండా మాట్లాడుకోగలుగుతున్నాము, ఆ కష్టం మనకు తెలియటం లేదు!




ఈ పని చేస్తే పుణ్యం, ఈ పని చేస్తే పాపం అనే నియమం/కొలమానం ద్వారా ఈ సృష్టిని కంట్రోల్ చేయటం.
పలానా చెడు చేశావు కాబట్టి జంతువు జన్మ, చెట్టు, పక్షి, రాయిగా, అవయవ లోపంగా జన్మించటం.

**నియమం:** ఈ సృష్టి ఎట్టిపరిస్థితులలో జరగకుండా ఆగకూడదు, తొందరగా నాశనం అవ్వకూడదు.
అనుకొన్న విధముగా జరగాలి. అంటే కలియుగం 4,32,000 సంవత్సరాలు కావున అంతే సమయం జరగాలి.
అంటే సృష్టి ముందే నాశనం అవ్వకూడదు, అంతకన్నా ఎక్కువ సంవత్సరాలు జరగరాదు, పూర్తిగా ఆగిపోకూడదు!

1) హిరణ్యకశిపుడు చనిపోయినాక ప్రహ్లాదుడు రాజ్యం పాలిస్తాడు, అప్పుడు అందరూ రాక్షసత్వం వదిలేస్తారు, అంటే స్థితి ధర్మం ఆగిపోయింది

2) శివుడు, శ్రీకృష్ణుడు, విష్ణువు, భగవాన్ రమణమహర్షి, ఆదిశంకరులు తలచుకొంటే అందరికీ మోక్షం ఇవ్వలేరా? మోక్షం ఇవ్వలేకపోతే సర్వ శక్తి, సర్వ విజ్ఞత లక్షణం భగవంతునికి లేదు అని అనుకోవాలి. అంటే దేవుడుకి కూడా పరిమితి శక్తి మాత్రమే ఉంది అనాలి, కదా! కానీ ఎందుకు మోక్షం ఇవ్వటం లేదు? ఇస్తే, సృష్టి అంతా ఆగిపోతుంది. సృష్టి ఆగిపోతే సమస్య ఎవరికి? బ్రహ్మనికే! మళ్ళీ సృష్టి చేయాలి. అంటే మోక్షం ఇవ్వటం ఎందుకు? మళ్ళీ సృష్టి చేసుకోవటం ఎందుకు?

## Part -2 రూపం ఉంది అంటే దానికి ముగింపు/నాశనం/అంతం/మరణం ఉంది అని అర్థం





20 సంవత్సరాల స్క్రాప్ పాలసీ

పాలు



మందులు




10 - 13 సంవత్సరాలు


మనిషికి 100 సంవత్సరాలు ఆయుష్షు




భూమి కూడా రూపమే కదా, దానికి కూడా అంతం/నాశనం/ముగింపు ఉండాలి కదా??






**Note:** కలియుగం అంటే దాదాపు 90 సంవత్సరాలు నిండిన ముసలి వ్యక్తి వంటిది. అందుకే విలువలు వేగంగా పడిపోతున్నాయి. అంటే ముసలి వయస్సులో ఒక రోగం మరో రోగాన్ని కలిగించినట్టు.

# కర్మ గురించి ఒక మంచి ఉదాహరణ

మహాభారతం లోని అనుశాసనిక పర్వం లోని గౌతమి-లుబ్ద కథ ప్రకారం
ఒక ఊరిలో ఊరిచివరన గల ఇంట్లో ఇక ఇల్లాలు ఉండేది...






ఈ "శరీర నేను" చేసిన కర్మను అనుభవించటానికి పోలీస్ చే శిక్షించబడుతున్నాను. అంటే పోలీసులు నా పాప కర్మను అనుభవించటానికి వారు సహాయం చేస్తున్నారు. కర్మ అనుభవించాలంటే ఏదో ఒకరిద్వారా జరగాలి. అది పోలీస్ ద్వారా జరుగుతుంది. పోలీసులు నిమిత్తమాత్రులు.



చెడు ప్రారబ్దం(పాపం) పనిచేస్తున్నప్పుడు శక్తి, బుద్ధి, తెలివి పనిచేయదు. బుద్ధి, శక్తి సరిగ్గా పనిచేస్తే ప్రారబ్దం అనుభవించలేము.
శ్రీ కృష్ణుడు చనిపోయిన తర్వాత అర్జునుడు, శ్రీ కృష్ణుని భార్యలను ద్వారక నుంచి తీసుకొని వెళ్తుండగా, బందిపోటు దొంగలు అడ్డువస్తే తన దగ్గర ఉన్న అస్త్ర, శస్త్రాలు పని చేయలేదు, గుర్తుకు రాలేదు. అక్కడ దొంగల యొక్క ప్రారబ్దం ఎక్కువుగా పనిచేస్తుంది.

కనుక కష్టాలు వచ్చినప్పుడు, దుఃఖం వచ్చినప్పుడు నా తెలివి ఎందుకు పనిచేయలేదు, శక్తి ఏమయ్యినది అని కంగారు పడకండి. మానసిక దుఃఖం వచ్చి ఈ జీవుడు బాధపడాలి, ఏడవాలి అని ఉంటే శక్తి, బుద్ధి పనిచేయదు, అప్పుడే కదా దుఃఖాన్ని అనుభవించేది. కావున ఎంతటి శక్తి వంతులైన, తెలివితేటలు కలిగినా, ప్రారబ్దానికి తల వంచాల్సిందే!




ప్రారబ్దం శరీరాలను కంట్రోల్ చేయటం




A : ఈ "శరీరంలో గల నేను" కర్మను వీరి రూపంలో అనుభవిస్తున్నది. కర్మ అనుభవించాలంటే ఎవరో ఒకరు కావాలి, అందుకు వారు సహాయం చేస్తున్నారు.

B : ఈ "శరీరంలో గల నేను" చెడు కర్మను పొందుతున్నది. కర్మ పొందాలంటే ఎవరో ఒకరు కావాలి కదా? అందుకు A శరీరంలో గల అమ్మాయిని ఏడిపించటం ద్వారా పాప కర్మను పొందుతున్నది. చెడు కర్మ పొందుటకు ఆ అమ్మాయి సహాయం చేస్తున్నది.

( ఈ సృష్టిని గమనిస్తే అందరూ కూడా (మంచి-చెడు)కర్మను అనుభవించుటకు, (మంచి-చెడు)కర్మను పొందుటకు ఒకరినొకరు సహాయం చేసుకొంటూ ఈ సృష్టిని ముందుకు తీసుకువెళ్తున్నారు )




B: ఓ రోజు ఈ "శరీరంలో గల కర్మ ఇంతకముందు చేసిన చెడు కర్మను మరొకరిద్వారా అనుభవిస్తుంది. అందుకు ఎవరో ఒకరు కావాలి కాబట్టి C రూపంలో బాధపడుతూ పోగొట్టుకొంటున్నాను.

C: ఈ "శరీరంలో గల నేను" చెడు కర్మను పొందుతున్నది. కర్మ పొందాలంటే ఎవరో ఒకరు కావాలి కదా? అందుకు B శరీరంలో గల అబ్బాయిని ఏడిపించటం ద్వారా పాప కర్మను పొందుతున్నది.

Part -2 శాపాలు, వరాలు ఒకదానికి ఒకటి LINK అయ్యి ఉంటాయి. ఒకటి జరిగితే దానికి LINK ఏదో పాపం, పుణ్యం ఉంది!




**NOTE: జయ, విజయుల కర్మను అనుభవించటానికి శ్రీరామ, శ్రీకృష్ణ, నరసింహ స్వామి, మంధర సహాయం చేశారు**

**గమనిక:** రామాయణంలో జరిగే ప్రతి సంఘటన ఏదీ యాక్సిడెంటల్ గా జరగటం లేదు, పక్కా ప్రణాళికతో జరిగింది. అలానే మన జీవితంలో ఏది జరిగినా పక్కా ప్రణాళికతోనే జరుగును. కొడుకు మాట వినలేదు, భర్త త్రాగుబోతు/కొడుతుంటే, పిల్లలు వైకల్యంతో పుట్టటం, ఆస్థి నష్టం..... ఏదో యాక్సిడెంటల్ గా జరగటం లేదు, పక్కా ప్రణాళికతో జరిగింది. గత జన్మలలో చేసిన కర్మ వలన వాళ్ళ చేతిలో బాధపడాలి అని ఉంది కాబట్టి పక్కగా వాళ్ళు ప్రతీకారం కోసం ఇప్పుడు వాళ్ళతో కలిసి ఉండాల్సివచ్చింది.

# Part -3

# నిజ జీవిత అనుభవాలు / Practical

**ఆత్మ జ్ఞానం/బ్రహ్మ జ్ఞానం**

**1**

ఆత్మ/బ్రహ్మం/దేవుడు అంటే ఏమిటి?

(సర్వ శక్తి + సర్వ విజ్ఞత + సర్వ వ్యాప్తం నిరాకారం)

**2**

ఆత్మ/బ్రహ్మం/దేవుడు యొక్క సహజ ధర్మం ఏమి?

( సృష్టి, స్థితి, లయం )

**3**

ఆత్మ/బ్రహ్మం/దేవుడు సహజ ధర్మాన్ని ఎలా నడిపిస్తుంది?

(కర్మ)

# అనుభవాలు



- సాధారణ ఉదాహరణ: పళ్ళు, నాళికను కరిస్తే, పళ్ళను మనం ఏమైనా అంటామా?
- రమణాశ్రమంలో దొంగతనం జరిగినప్పుడు దొంగలు కొడితే, అప్పుడు భగవాన్ రమణులు చెప్పినది "నా కర్రతో(కర్ర), నన్ను(రమణ మహర్షి) నేను(దొంగ) కొట్టుకొంటున్నాను" ఎందుకు దొంగలమీద కోప్పడేది అంటారు.
- రమణులకి తేనెటీగలు కుట్టినప్పుడు చెప్పినది ఏమిటంటే "ఈ శరీరం తప్పుచేసినది, అనుభవిస్తున్నది" - కర్మను Acceptance
- డాక్టర్ మత్తు ఇవ్వకుండానే ఆపరేషన్ చేస్తుంటే, అప్పుడు భగవాన్ రమణులు ఆ నొప్పిని లెక్కచేయక అదే ప్రశాంతతో ఉన్నారు
- శుకమహర్షి: జనకమహారాజు మోహపరీక్ష పెట్టినా, కామపరీక్షపెట్టినా, నిరాశపరచినా అదే ప్రశాంతత తో ఉన్నాడు, కారణం డబ్బులో ఉన్నది, ఆడవారి ఆకర్షణలో ఉన్నది, నిరాశపెట్టే వ్యక్తిలో ఉన్నది నేనే.
- రమణ మహర్షి కి ఒక రాయి తన కాలికి తగులబోతుంది అని తెలిసి కూడా కర్మను అంగీకరించటం. ఎందుకంటే బ్రహ్మమే తన సృష్టి ధర్మాన్ని చేయుటకు కర్మ ద్వారా కంట్రోల్ చేస్తుంటే, ఆ బ్రహ్మమే దానిని పాటించకపోతే ఎలా? - కర్మను Acceptance
- ఒక వ్యక్తి ఆవుని కొడుతుంటే ఎందుకు కొడుతున్నావు అని అడ్డుపడితే, నిన్ను కొట్టనా?
- ఒక వ్యక్తి గుర్రాన్ని కొడితే సాయిబాబా తనకు దెబ్బలు తగిలినాయి అని అంటాడు
- ఒక వ్యక్తి కుప్పతొట్టిలో గల విస్తరాకులలో గల అన్నాన్ని, కుక్కను తింటుంటే... ఏమి తినుతున్నావు ? అంటే...
- వివేకానందుడు రామకృష్ణ పరమహంసను అడుగుతాడు గొంతు కాన్సర్ ని అమ్మవారిని అడిగి నయం చేయించుకోవచ్చు గదా?



Part -3

# అంతటా బ్రహ్మాన్ని చూడటం ఎలా?



నేనే ఈ విశ్వం అంతా    బ్రహ్మం ఈ విశ్వం అంతా వుంది




నేనే ఈ 14 లోకాలు అంతా. బ్రహ్మం ఈ 14లోకాలలో కూడా వున్నది




"నేను" నన్ను కొరుక్కొన్నాను. పన్నులో గల "నేను" తో, నాలుకలో గల "నేను" ని కొరికినప్పుడు, అప్పుడు నొప్పి అనే "నేను" పుట్టింది.

బ్రహ్మం, బ్రహ్మంని కొరికింది.




నేను నాతో తోముకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంతో తోముకుంటున్నది




నేను నాతో స్నానం చేస్తున్నాను
బ్రహ్మం, బ్రహ్మంతో స్నానం చేస్తున్నది




నేను నన్ను తింటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను తింటున్నది




నేను నాతో పనిచేస్తున్నాను
బ్రహ్మం, బ్రహ్మంతో పనిచేస్తున్నది




నేను నన్ను చూస్తున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను చూస్తూవున్నది




నేను నాతో పడుకొనివున్నాను
బ్రహ్మం, బ్రహ్మంతో పడుకొనివున్నది




నేను నన్ను నాతో శభ్రంచేసుకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను బ్రహ్మంతో శుభ్రం చేసుకొంటున్నది




నేను నన్ను నాతో ముక్కలుచేసుకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను బ్రహ్మంతో ముక్కలుచేసుకొంటున్నది




నేను నన్ను చదువుతున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను చదువుతున్నది




నేను నన్ను శభ్రంచేసుకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను శుభ్రం చేసుకొంటున్నది




నేను నాతో మాట్లాడుతున్నాను
బ్రహ్మం, బ్రహ్మంతో మాట్లాడుతున్నది




నేను నన్ను తయారుచేసుకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను తయారుచేసుకొంటున్నది




నేను నన్ను ముసలిగా చేసుకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను ముసలిగా చేసుకొంటున్నది




నేను నన్ను పట్టుకొంటున్నాను
బ్రహ్మం, బ్రహ్మంను పట్టుకొంటున్నది



నేను నన్ను ప్రేమిస్తున్నాను
బ్రహ్మం బ్రహ్మంను ప్రేమిస్తున్నది



నేను నన్ను కోరుకొంటున్నాను
బ్రహ్మం బ్రహ్మంను కోరుకొంటున్నది



నేను నామీద ఈర్ష్యపొందుతున్నాను
బ్రహ్మం బ్రహ్మంను ఈర్ష్యపడుతున్నది




"నేను" నన్ను కొరుక్కొన్నాను. పన్నులో గల "నేను" తో, నాలుకలో గల "నేను" ని కొరికినప్పుడు, అప్పుడు నొప్పి అనే "నేను" పుట్టింది.

బ్రహ్మం, బ్రహ్మంని కొరికింది.




"నేను" నన్ను ఆపరేషన్ చేసుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", అవతలివ్యక్తిలో గల "నేను" ని, కత్తి లో గల "నేను" తో కోసుకొంటున్నాను.




"నేను" నామీద కోపంతో ఉన్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", అవతలివ్యక్తిలో గల "నేను" మీద, కోపం అనే "నేను"(కోపం కూడా నేను సృష్టే!) ని ప్రదర్శించటం




"నేను" నన్ను ఎగతాళి చేసుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", అవతలివ్యక్తిలో గల "నేను" ని ఎగతాళి చేయటం.




"నేను" నాకు హారతి ఇచ్చుకొంటున్నాను. ఈ శరీరంలో గల "నేను" తో విగ్రహంలో గల "నేను" కి, దీపం అనే "నేను" తో హారతి ఇచ్చుకొంటున్నాను.




నన్ను "నేను" భయపెట్టుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", ఉద్యోగి లో గల "నేను" ని మాటలు అనే "నేను" తో భయపెట్టుతున్నాను.




నాకు "నేను" సహాయం చేసుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", అవతలి వ్యక్తిలో గల "నేను" కి సహాయం చేసుకొంటున్నాను




"నేను" నన్ను కాల్చుకొంటున్నాను. అగ్నిలో గల "నేను", శరీరంలో గల "నేను" ని, కట్టెలలో గల "నేను" తో కాల్చుకొంటున్నాను.



"నేను" నాకు అన్నం పెట్టుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", కుక్క శరీరంలో గల "నేను" కి, అన్నం లోగల "నేను" ని పెట్టుకొంటున్నాను.



"నేను" నా మీద పడుకొన్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", బెడ్ లో గల "నేను" మీద, దుప్పటి లోగల "నేను" తో కప్పుకొని పడుకొన్నాను.




నేను నన్ను తింటున్నాను. పంది రూపంలో గల "నేను", కుళ్లిపోయినవాటిలో గల "నేను" ని తిని నా పరిసరాలను శుభ్రంగా ఉంచుకొంటున్నాను.







"నేను" నాకు బోధనచేసుకొంటున్నాను. గురువు లో గల "నేను", విద్యార్థి లోగల "నేను" కి బోధన చేసుకొంటున్నాను.




"నేను" నాకు కాంతిని ప్రసరించుకొంటున్నాను. సూర్యునిలోగల "నేను", మొక్కలలో గల "నేను" కి కాంతిని ఇచ్చుకొంటున్నాను




నన్ను "నేను" కనిపెట్టుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను" లో గల ఆలోచనలతో క్రొత్త వస్తువులలో గల "నేను" ని కనిపెట్టుకొంటున్నాను.




"నేను" నాతో పని చేయించుకొంటున్నాను. అంటే ఈ శరీరంలో గల "నేను", కంప్యూటర్ లో గల "నేను" తో పని చేయించుకొంటున్నాను.


బ్రహ్మం ఇక్కడ చిత్రంగా ఉంది
జీవుడు(మాయ తో బందీ అయిన బ్రహ్మం)
సర్వ శక్తి సర్వ వ్యాప్తం అయిన బ్రహ్మం ఇప్పుడు గోడగా ఉంది
జీవుడు(మాయ తో బందీ అయిన బ్రహ్మం)
బ్రహ్మం ఇక్కడ చెక్కగా ఉంది
జీవుడు(మాయ తో బందీ అయిన బ్రహ్మం)
బ్రహ్మం ఇక్కడ సోఫా కవర్ గా ఉంది
జీవుడు(మాయ తో బందీ అయిన బ్రహ్మం)
బ్రహ్మం ఇక్కడ పోఫా ఫ్లోర్ గా ఉంది
జీవుడు(మాయ తో బందీ అయిన బ్రహ్మం)

# Part -3 ప్రతి ఆలోచనలో బ్రహ్మాన్ని చూడటం ఎలా?

"నేను శరీరమే"(రాగి/అజ్ఞానం/మలినం) భాష →→ నేను బ్రహ్మం" (బంగారం/జ్ఞానం) బాష

ఈ శరీరమే నేను → అంతటా నేను ఉన్నాను, ఈ శరీరంలో "కూడా" నేను ఉన్నాను
ఇది మంచిది, ఇది చెడ్డది → నాకు అన్నీ మంచివే, ఎందుకంటే అన్నీ నేనే
నా వారు, నా పిల్లలు, నా బంధువులు → అందరూ నావారే, నేను అందరిలో ఉన్నాను
నేను దీనిని తింటున్నాను → నన్ను నేను తింటున్నాను
నేను వాళ్లకు ఇస్తున్నాను → నాకు నేను ఇచ్చుకొంటున్నాను
నేను అతనిని కొట్టాను → నన్ను నేను కొట్టుకున్నాను
నేను అతనిని ఎగతాళి చేశాను → నన్ను నేను ఎగతాళి చేసుకొన్నాను
ఇది భయం కలిగిస్తుంది → నన్ను చూసి నేను భయపడుతున్నాను
అతను నన్ను పొగిడాడు → నన్ను నేను పోగుడుకొంటున్నాను
చేయికి నొప్పి కలిగిస్తుంది → నాకు నేను నొప్పి పుట్టించుకుంటున్నాను
ఈ రోజు క్రిందపడుకోవాల్సివచ్చింది → నామీద నేను పడుకొంటున్నాను
నేను మామిడికాయను తింటున్నాను → నేను నన్ను(మామిడికాయ) తింటున్నాను
నేను కుర్చీ మీద కూర్చున్నాను → నేను నామీద కూర్చున్నాను
నేను అతనికి పాఠం చెపుతున్నాను → నాకు నేను పాఠం చెప్పుకొంటున్నాను
నేను అతనిని చూసి ఈర్ష పడుతున్నాను → నన్ను చూసి నేను ఈర్ష్య పడుతున్నాను

**భగవద్గీత: చంపేవాడిని నేను(బ్రహ్మం), యుద్ధం చేయుచున్నది నేను(బ్రహ్మం), చంపబడే వాడిని నేనే(బ్రహ్మం), నీ శరీరం నిమిత్త మాత్రం(అర్జునుని), కావున అర్జునుడు(నువ్వు) చేస్తున్నావనే భావం విడిచి, బ్రహ్మం చేయిస్తున్నది అనే భావనతో యుద్ధం చేయుము. అది హింస అయిననూ అర్జుననుకు పాపం, పుణ్యం అంటదు!**

Part -3

# ధ్యానం చేయటం ఎలా?



(విశ్వ రూప సందర్శనం అంటే ప్రతి అణువు నేనే/బ్రహ్మమే)

**నాకు(బ్రహ్మం) కి ధర్మం ఉంది**

నన్ను(బ్రహ్మం) నేనే(బ్రహ్మాన్ని) సృష్టి చేసుకొంటున్నాను
నన్ను నేనే స్థితి చేసుకొంటున్నాను
నన్ను నేనే లయం చేసుకొంటున్నాను
నాకు నేనే అవిద్య/మాయ కల్పించుకొంటున్నాను
నాకు నేనే రూపం పుట్టించుకొంటున్నాను

నన్ను నేనే ప్రేమించుకొంటున్నాను
నన్ను నేనే ద్వేషించుకొంటున్నాను
నన్ను నేనే ఈర్ష్య చెందుతున్నాను
నన్ను నేనే కామిస్తున్నాను
నన్ను నేనే కోరుకొంటున్నాను
నన్ను నేనే శిక్షించుకొంటున్నాను
నన్ను నేనే రక్షించుకొంటున్నాను
నాకు నేనే బంధాన్ని వేసుకొంటున్నాను(అజ్ఞానిగా)
నాకు నేనే బంధాన్ని తీసేసుకొంటున్నాను(జ్ఞానిగా)
నాకు నేనే శాపాలు ఇచ్చుకొంటున్నాను
నాకు నేనే వరాలు ఇచ్చుకొంటున్నాను
నన్ను నేనే పూజించుకొంటున్నాను
నన్ను నేనే చంపుకొంటున్నాను
నన్ను నేనే అసహ్యించుకొంటున్నాను
నన్ను నేనే మోసం చేసుకొంటున్నాను
నాకు నేనే సహాయం చేసుకొంటున్నాను
నాకు నేనే కష్టం కలిగించుకొంటున్నాను
నాకు నేనే నష్టం కలిగించుకొంటున్నాను

సర్వం బ్రహ్మం / నేనే

కారణ,సూక్ష్మ,స్థూల శరీరం నేనే/బ్రహ్మమే
దుర్మార్గుడు నేనే/బ్రహ్మమే
మంచివాడు నేనే/బ్రహ్మమే
స్వర్గం నేనే/బ్రహ్మమే
నరకం నేనే/బ్రహ్మమే
మనస్సు నేనే/బ్రహ్మమే
ఆలోచనలు నేనే/బ్రహ్మమే
ధర్మం నేనే/బ్రహ్మమే
అధర్మం నేనే/బ్రహ్మమే
మాయ నేనే/బ్రహ్మమే
జగత్ నేనే/బ్రహ్మమే
సృష్టి నేనే/బ్రహ్మమే
స్థితి నేనే/బ్రహ్మమే
లయం నేనే/బ్రహ్మమే
కర్మ నేనే/బ్రహ్మమే
ప్రేమ నేనే/బ్రహ్మమే
బంధం నేనే/బ్రహ్మమే
దయ నేనే/బ్రహ్మమే
శాంతి నేనే/బ్రహ్మమే
మరణం నేనే/బ్రహ్మమే
వాసనలు నేనే/బ్రహ్మమే
దేవతలు నేనే/బ్రహ్మమే
రాక్షసులు నేనే/బ్రహ్మమే
జన్మ నేనే/బ్రహ్మమే
మదం నేనే/బ్రహ్మమే
ద్వేషం నేనే/బ్రహ్మమే
ఈర్ష్య నేనే/బ్రహ్మమే
కోపం నేనే/బ్రహ్మమే
శత్రువు నేనే/బ్రహ్మమే
కామం నేనే/బ్రహ్మమే
లోభం నేనే/బ్రహ్మమే
అజ్ఞానం నేనే/బ్రహ్మమే
జ్ఞానం నేనే/బ్రహ్మమే
వాసనలు నేనే/బ్రహ్మమే
అవిద్య నేనే/బ్రహ్మమే
విద్య నేనే/బ్రహ్మమే
నీరు నేనే/బ్రహ్మమే
మనుష్యులు నేనే/బ్రహ్మమే
గాలి నేనే/బ్రహ్మమే
అగ్ని నేనే/బ్రహ్మమే
భూమి నేనే/బ్రహ్మమే
మంచి నేనే/బ్రహ్మమే
చెడు నేనే/బ్రహ్మమే
ఆకాశం నేనే/బ్రహ్మమే
వస్తువులు నేనే/బ్రహ్మమే
రాళ్లు నేనే/బ్రహ్మమే
చెట్లు నేనే/బ్రహ్మమే
పక్షులు నేనే/బ్రహ్మమే
జంతువులు నేనే/బ్రహ్మమే



**విశ్వ రూప సందర్శనం పాట వినటం కోసం ఇక్కడ క్లిక్ చేయండి.**
**(నేను అంటే బ్రహ్మం అని అర్థం)**



**ధ్యానం: ధ్యానం అనేది క్రొత్త కాదు, డబ్బు సంపాదించాలనే కోరిక ఉన్నవారికి మనస్సు నిరంతరం డబ్బు సంపాదించటంపై ధ్యాస/ధ్యానం కలిగి ఉంటారు. ప్రేమికుల మనస్సు నిరంతరం ప్రేమించిన వ్యక్తిపై ధ్యాస కలిగి ఉంటారు. బంధువులు, దగ్గరివారు మరణించారు అని వార్త తెలిసినప్పుడు, భోజనం చేస్తున్నా, డ్రైవింగ్ చేస్తున్నా, వ్యాపారం చేస్తున్నా,ఆలోచనలు అనేవి ఆ వ్యక్తిపైకి వెంటనే వెళ్తుంటాయి. ఎప్పుడైతే బ్రహ్మం గురించి ఎక్కువుగా తెలుసుకోవటం, మననం చేస్తుంటామో, అన్నిట్లో అనుభూతి చెందటం మొదలు పెడతామో, అప్పుడు బ్రహ్మంగా ఆలోచిస్తూ ఉంటుంది(ధ్యానం).**

# నేను శరీరం




శరీరంలో గల మంచి, చెడు నేనే. శరీర అందం,మాట నేనే, నవ రంధ్రాలలో గల చెడు వాసన, పదార్ధం నేనే!

నేను బ్రహ్మం => నాకు సహజంగా సర్వ శక్తి, సర్వ విజ్ఞత ఉంది, నేను సర్వ వ్యాప్తంగా ఉన్నాను.

నాకు ఒక సహజ ధర్మం ఉంది => అంటే నేనే సృష్టి, స్థితి, లయం చేసుకొంటున్నాను.

నేనే సృష్టి, స్థితి, లయ ధర్మాన్ని కర్మ ద్వారా నిర్వహిస్తుంటాను. అంటే నేనే కర్మ(పాప, పుణ్యం) ద్వారా వివిధ పేర్లతో, ఆకారాలతో ఉంటూ, నా ధర్మాన్ని నేనే నిర్వహించుకొంటున్నాను.



# Part -3 సారాంశం సులభంగా గుర్తుపెట్టుకోవటం ఎలా?






**3**

నేను సృష్టిని కర్మ ద్వారా కంట్రోల్ చేస్తాను



**2**

నాకు ధర్మం ఉంది(సృష్టి, స్థితి, లయ)

**4**

సృష్టి ధర్మం చేయటానికి ఈ శరీరంలో కూడా ఉన్నాను

**5**

సృష్టి ధర్మం చేయటానికి

ఆ వస్తువు, వ్యక్తి, పదార్థంలో కూడా ఉన్నాను

**1**

నేను బ్రహ్మం ను

సర్వ శక్తి + సర్వజ్ఞత + సర్వ వ్యాప్తం







**6**

ఈ శరీరం తన కర్మను/ప్రారబ్దంను అనుభవించటానికి వస్తువులు, వ్యక్తులు, పదార్థాలు సహాయం చేస్తున్నాయి.

# Part -4

## సాధన/పురుష ప్రయత్నం చేయుట

(నేను అంటే ఈ శరీరం కాదు, బ్రహ్మం అని  సహజంగా నమ్మటం)

# Part -4 మోక్ష సాధనకు అనువైన జన్మ, పరిస్థితులు, వాతావరణంలో జన్మించటం అత్యంత కష్టం




ఎంతో ఘోరమైన పాపం చేస్తే రాయి, మట్టి గా జన్మ!
(రాళ్ళలో మనస్సు నిద్రాణంగా ఉంటుంది - పాప/పుణ్య చిట్టా వాసనలు/కోరికలు/జ్ఞానం అవి నిద్రానముగా వుంటాయి)

రాయిని దేవుని విగ్రహముగా ఉపయోగిస్తే, జ్ఞానులు ఇంటి నిర్మాణం కొరకు ఉపయోగిస్తే పుణ్యం సంపాదిస్తుంది!

ఆత్మజ్ఞానం పొందే అర్హ్వత లేదు

ఎంతో ఎక్కువ పాపం చేస్తే చెట్టు గా జన్మ!
(చెట్లలో మనస్సు బీజ రూపంలో నిద్రాణమై ఉంటుంది. పాప/పుణ్య చిట్టా, కోరికలు/జ్ఞానం అవి నిద్రానముగా వుంటాయి)

మహాత్ములకు నీడ ఇస్తే, పూజకు పూలు ఇస్తే, పండు ఇస్తే... పుణ్యం సంపాదిస్తుంది.

ఆత్మజ్ఞానం పొందే అర్హ్వత లేదు

ఎక్కువ పాపం చేస్తే పక్షి గా జన్మ!
(పక్షిలో మనస్సు ఉంటుంది, కానీ అది పూర్తి స్థాయిలో ఉండదు. మమకారం, నేను, నాది, దుఃఖం సుఖం ఉంటుంది)

పాప/పుణ్య చిట్టా, కోరికలు/జ్ఞానం అవి నిద్రానముగా వుంటాయి)

ఆత్మజ్ఞానం పొందే అర్హ్వత లేదు

ఎంతో పాపం చేస్తే జంతువుగా జన్మ!
(జంతువులో మనస్సు ఉంటుంది, కానీ అది పూర్తి స్థాయిలో ఉండదు. మమకారం, నేను, నాది, క్రోధం, లోభం, కామం, మదం, ప్రేమ, విశ్వాసం దుఃఖం, సుఖం ఉంటుంది)

(పాప/పుణ్య చిట్టా, కోరికలు/జ్ఞానం అవి నిద్రానముగా వుంటాయి)

మహాత్ములకు సేవ చేసి, శక్తిని ఉపయోగించి, పుణ్యం సంపాదిస్తాయి.

ఆత్మజ్ఞానం పొందే అర్హ్వత లేదు.

పుణ్యం, పాపం రెండూ సమానం అయితేనే మనుష్యుని జన్మ! మనిషి మనస్సు సంపూర్ణంగా ఎదిగి ఉంటుంది. పాపం, పుణ్యం, కోరికలు, జ్ఞానం అనేవి పనిచేస్తాయి. నేను, నాది, ధన, కీర్తి, స్త్రీ వాసన, కామ, క్రోదం, లోభం, మదం, ఈర్ష్య, ... ఉంటాయి

ఆత్మజ్ఞానం పొందే అవకాశం/అర్హ్వత వస్తుంది.

మోక్షం అనే పదం భరత దేశంలోనే ఉంది, కావున ఇతర దేశంలో కంటే భారత దేశంలో పుట్టాలి..
తమో గుణం (నాస్తికునిగా) పుట్టటం కంటే,
రజోగుణం (కోరికతో భగవంతుని ప్రేమించటం) మేల
సత్ గుణం(మోక్షం గురించి తపించే వారు ఇంకా వే

Part -4 సాధన - ఇది క్రొత్తగా వచ్చినది కాదు, మనకు అలవాటు అయినదే!




గుమస్తా గా ఉన్న వ్యక్తికి ప్రమోషన్ వచ్చి మేనేజర్ అయ్యాడు, ఇప్పుడు అతనిని అడిగితే మీరు ఎవరు అంటే? మేనేజర్ అని అంటాడు. మార్పు ఎక్కడ జరిగింది, అతని మనస్సులో! ఎలా నమ్మాడు అంటే? ప్రమోషన్ లెటర్ చూసి, క్రొత్త సీట్ లో కూర్చోవటం, అందరూ మేనేజర్ అని పిలవటం వలన అతని మనస్సు బలంగా నమ్మింది. మేనేజర్ అని అనుభూతి(స్థిర అభిప్రాయం/నమ్మకం) చెందటం.

నిన్నటి వరకు ఆనందంగా ఉన్న వ్యక్తికి ఈ రోజు టెస్ట్ లో బ్లడ్ కాన్సర్ అని చెప్తే, కాన్సర్ వచ్చినట్టు అనుభూతి చెందుతున్నాడు? మరుసటి రోజు డాక్టర్ పొరపాటున రిపోర్ట్ మారింది అని చెప్పగానే మళ్ళీ కాన్సర్ లేనట్టు అనుభూతి చెందుతున్నాడు. అనుభూతి చెందటానికి ప్రధాన కారణం డాక్టర్ మీద నమ్మకం, రిపోర్ట్ మీద నమ్మకం.

పెళ్లి కాక ముందు తాను బాచిలర్ అని, పెళ్ళైన తర్వాత తాను ఒక భర్త అని బలంగా నమ్మి అనుభూతి చెందుతున్నాడు. కారణం పెళ్లి అంటే ఒక కళ్యాణ మండపం లో అందరి ముందు, మంత్రాల సాక్షిగా మూడు ముళ్ళు వేస్తే ఆమె నా భార్య అనే నమ్మకం. ఎందుకంటే అందరూ పెళ్లి అంటే ఇదే అని నమ్ముతున్నారు, కావున నమ్మటం.

ఇప్పటివరకు **నేను అంటే ఈ శరీరం** అని బలంగా నమ్ముతున్నాను, ఎందుకంటే నా చుట్టూ ప్రక్కల వాళ్ళు అలానే నమ్ముతున్నారు, అలానే పిలుస్తున్నారు. అలాగే కోట్ల జన్మల నుంచి అదే అలవాటు అయి నేను అంటే ఈ శరీరం అని బలంగా అనుభూతి చెందుతున్నాను. ఇప్పుడు ఈ ఆత్మ జ్ఞానం ద్వారా **నేను అంటే బ్రహ్మం అని, సర్వ వ్యాప్తం గా ఉన్నాను** అని గురువు ద్వారా, గ్రంధాల ద్వారా తెలుసుకొని అనుభూతి/ బలంగా నమ్మటం/స్థిర అభిప్రాయం చెందటం. సృష్టిని ముందుకు తీసుకెళ్లటం కోసం నాకు నేనే అజ్ఞానం కలిగించుకొని, జన్మలు ఎత్తుతున్నాను తప్ప, నిజానికి నేను బ్రహ్మం అని నమ్మటం/మోక్షం.

కావున మనస్సులో నేను బ్రహ్మం అని బలంగా నమ్మటమే మోక్షం!

Part -4

# సాధనాక్రమం



### మొదట్లో కొంతకాలం(Level-1)

ఉదయం 1గంట, సాయంత్రం 1గంట
నేను బ్రహ్మం అనే ధ్యానం చేయవలెను
(నేను బ్రహ్మం అని ఊహిస్తూ – 30ని||
నిశ్శబ్ద ఆలోచన రహిత స్థితి – 30ని||)
+
ప్రతి రోజు 30ని" ఆత్మ జ్ఞాన అధ్యయనం చేయాలి
+
వారానికి ఒకసారి సత్సాంగత్యం/చర్చలు చేయాలి

### మరి కొంతకాలం(Level-2)

ఉదయం 2 గంటలు, సాయంత్రం 2 గంటలు
నేను బ్రహ్మం, సర్వం బ్రహ్మం అనే ధ్యానం చేయవలెను
(నేను బ్రహ్మం, సర్వం బ్రహ్మం అని ఊహిస్తూ – 30ని||
నిశ్శబ్ద ఆలోచన రహిత స్థితి – 1గంట|| 30ని||)
+
ప్రతి రోజు 30ని" ఆత్మ జ్ఞాన అధ్యయనం చేయాలి
+
వారానికి ఒకసారి సత్సాంగత్యం/చర్చలు చేయాలి

### మరి కొంతకాలం(Level-3)

ఉదయం 4 గంటలు, సాయంత్రం 4 గంటలు
నేను బ్రహ్మం, సర్వం బ్రహ్మం అనే ధ్యానం చేయవలెను
(నేను బ్రహ్మం, సర్వం బ్రహ్మం అని ఊహిస్తూ – 30ని||
నిశ్శబ్ద ఆలోచన రహిత స్థితి – 3గంట|| 30ని||)
+
ప్రతి రోజు 30ని" ఆత్మ జ్ఞాన అధ్యయనం చేయాలి
+
వారానికి ఒకసారి సత్సాంగత్యం/చర్చలు చేయాలి

### Level-4

అనుభవ పూర్వకంగా
నేను బ్రహ్మం అని అనుభూతి
కలిగేవరకు చేయాలి.
నేను బ్రహ్మం అని నమ్మకం కలిగితే,
ఒక చోట కూర్చుని ధ్యానం
చేయాల్సిన అవసరం లేదు.

Ex: నేను రామారావు అని ధ్యానం
చేయటం లేదు కదా!




## ఆలోచనలు ఎలా ఆగుతాయి?

1) నేను శరీరం కాదు→నేను బ్రహ్మం అనే ఆలోచన ధృడపడును (ఎందుకంటే ప్రారబ్ధం ప్రకారం జరుగవలసినది జరుగును, సృష్టిలో మంచిని-చెడుని నేనే, సుఖం-దుఃఖం నేనే.. సృష్టిలో ప్రతీది నేనే, అన్నీ బ్రహ్మంలోనే జరుగుతున్నాయి.. అనే ఆలోచనల వలన గతం గురించి, భవిష్యత్తు గురించి, ఆలోచించటం/నిర్ణయాలు చేయటం, ప్రతీది తెలుసుకోవాలనే కోరిక/ఆసక్తి ఆగిపోతుంది, పొందాలనే/అనుభవించాలనే ఆసక్తి ఆగిపోతుంది)
2) మనస్సులోకి ఆలోచనలు రావటం ఆగిపోతాయి
3) బుద్ధి పనిచేయటం ఆగిపోతుంది
4) సాక్షి భావన, నిద్ర మత్తు లాంటి స్థితి, యాంత్రిక చర్య



Part -4

# ప్రతి ఆలోచనను ఆత్మ జ్ఞాన దృష్టి కోణంతో ఆలోచించటం




విచారణ(ఆత్మజ్ఞాన దృష్టికోణం) చేసిన ఆలోచనలు మంచి నీరు లాంటివి, విచారణ చేయని ఆలోచనలు మురికినీరు లాంటివి. మనస్సులోకి నిరంతరం విచారణ చేసిన ఆలోచనలు పంపుతామో అజ్ఞానం పోతుంటుంది. కొన్నిరోజులకి జ్ఞానమే ఉంటుంది.

మంచి నీరు నిరంతరం పోయగా, కొన్నిరోజులకి శుద్ధమైన నీరు తొట్టిలో ఎలా ఉంటుందో, అలా మనస్సు అంతా జ్ఞానంతో నిండిపోతుంది.





Part -4 **నిజానికి కర్మ ఎవరు చేస్తున్నారు? ఎవరి వలన జరుగుతుంది?**

కంప్యూటర్ కి శక్తిని కరెంటు ద్వారా ఉపయోగించుకొని హార్డుడిస్క్(మెదడు) లో గల software(కోరిక) పనిచేస్తుంది. software పనిచేయడానికి మూలకారణం ఎవరు? కరెంటు. అంతటి కంప్యూటర్ కి కరెంటు(పవర్) లేకపోతే ఏ ఒక్కటి కూడా పని చేయదు. అన్నీ పవర్ మీదనే ఆధారపడతాయి, కానీ పవర్ ని ఎవ్వరూ గుర్తించరు.

మనిషి ఏదైనా పని చేస్తున్నప్పుడు దానికి కారణం **శరీర నేను(రామారావు, సుబ్బమ్మ..)** అని మనస్సు అనుకొంటుంది, నిజంగా మనస్సే కారణమా? మాట్లాడుతున్నాము అంటే మనస్సులో గల ఆలోచన, ఆ మెదడుకి శక్తి ఇవ్వాలి! ఆ శక్తిని ఎవరు ఇస్తున్నారు? అది సర్వ వ్యాప్త నేనే!(బ్రహ్మమే!). ఇలా శరీరంలోని ప్రతీదానికి శక్తి అనేది ఆత్మ శక్తి ద్వారానే అందుతుంది, కానీ మనస్సు తాను చేస్తున్నాను అని గొప్పలు చెప్పుకొంటుంది. దీనివల్లనే మనకు వచ్చిన సమస్య!

కంప్యూటర్ software ఒక పని చేసిపెట్టింది(WRONG) ==> కంప్యూటర్ లో గల పవర్(కరెంటు) శక్తి వలన software,Hardware పనిచేయగలిగింది(RIGHT)

నేను మాట్లాడుతున్నాను(WRONG) ==> శరీరంలోగల బ్రహ్మం శక్తి వలన, మెదడుకి,అవయవాలకు శక్తి అంది మాట్లాడుతున్నాను(RIGHT)



Part -4

## ఈ ప్రపంచమే ఒక సాధన వస్తువు(ప్రారబ్దాన్ని మోక్ష సాధన పరికరంగా మార్చుకో)

- ప్రతీకారం - అన్యాయంగా ఆస్తిని తీసుకొన్నా, నీవు చేసిన పనిని మరొకరు వాడుకొన్నా... ప్రతీకారం, హింస లేకుండా ఉండాలి... ఎందుకంటే అలా వారు తీసుకొన్నారు అంటే నీ ప్రారబ్దం లో అలా ఉంది కావున, నీ ప్రారబ్దానికి వారు సహాయం చేస్తున్నారు.. వారి తప్పు లేదు. కావున వారిపై ప్రతీకారం, కోపం, ద్వేషం, హింస వద్దు... ఇంకొక విధముగా ఆలోచిస్తే వారు బ్రహ్మమే, నీవు బ్రహ్మమే!.. ఈ శరీరం తప్పు చేసింది, ఇప్పుడు అనుభవిస్తుంది, అనుభవించనీ... తప్పు చేసి తప్పించుకోవాలనుకోవటం అధర్మం!(ప్రారబ్దాన్ని వద్దనుకోవటం)

- క్షమ,ఓర్పు,సహించుట – దుర్మార్గులైన భర్త/కొడుకు/అల్లుడు/మామ/భార్య/కూతురు/తల్లి/తండ్రి వచ్చినా, ప్రతీకారం, ద్వేషం లేకుండా ఉండుము. ఎందుకంటే నీ ప్రారబ్దంమే వారి రూపంలో వచ్చి అనుభవించేలా చేస్తుంది... వారు ఇబ్బంది పెట్టినప్పుడు, హింసించినప్పుడు, నీవు శరీరం అనే ఆలోచనతో ఉన్నావా? బ్రహ్మ అనే భావనతో ఉన్నావా? అని పరీక్ష చేసుకోవచ్చు. సుఖం తో ఉన్నప్పుడు నేను బ్రహ్మం అనుకోవటం సులభం, కష్టాలలో,దుఃఖాలలో బ్రహ్మ భావనతో ఉంటున్నావా? లేదా? అని తెలుసుకోవటానికి వారు సహాయం చేస్తున్నారు.

- అనారోగ్యం – షుగర్ వ్యాధి వచ్చి స్వీట్ తినలేకపోతున్నావు, నిజంగా స్వీట్ పై కోరిక పోయిందా? బలవంతంగా అణచిపెట్టుకొంటున్నావా? అని పరీక్ష చేసుకోవచ్చు. ఎందుకంటే స్వీట్ బ్రహ్మమే, చేదు బ్రహ్మమే అయినప్పుడు ఒకదానిపై కోరిక ఉండరాదు. అన్నీ నేనే కదా!

- వైకల్యంతో పుట్టిన పిల్లలకు సేవ చేయాల్సి రావటం, చెప్పిన మాట వినని పిల్లలు, వృద్ధాప్యంలో పిల్లల చేత మాటలు పడుట, చేతిలో డబ్బు లేకపోయి(పేదరికం), ఎన్ని ప్రయత్నాలు చేసినా సరైన పని దొరక పోవుట, అప కీర్తి/నిందలు, చేయని నేరములకు శిక్ష అనుభవించుట, దుర్మార్గులకు/శత్రువులకు/మోసం చేసేవారితో కలసి పని చేయాల్సి రావటం, వారికి సేవ చేయాల్సి రావటం. ఎంతో ప్రేమించిన వారు కోల్పోవటం, ఆస్థి పోయి రోడ్డున పడటం, అబద్దాలు చెప్పాల్సి రావటం, ఇలా ఏదో ఒక కఠినమైన కష్టాలు వస్తుంటాయి.

- ప్రారబ్దం ప్రకారమే దక్కుతుంది – పిల్లలకు ఆస్తిని సంపాదించి ఇవ్వాలని అవినీతి చేసి ఇస్తావు, కొడుకు ప్రారబ్దం లో పేదరికంతో అనుభవించాలని ఉంది, నీవు ఇచ్చిన ఆస్తిని ఏదో రకంగా పోగొట్టి పేదవాడు అవుతాడు. ఆరోగ్యం కాపాడుకోవటం కోసం విపరీతమైన శ్రమ(జిమ్), డబ్బు ఖర్చు పెడతారు, కానీ ఎన్ని చేసినా మరణాన్ని ఆపలేరు. మంచి పేరు కోసం ఆరాటపడకండి, నిందలు అనేది ప్రారబ్దం లో ఉంటే తప్పించుకోలేము.

- ఈ కష్టాల వలన అలసిపోవటం, పారిపోవాలనుకోవటం, ఆత్మహత్య చేసుకోవాలనుకోవటం, ప్రతీకారం తీసుకోవాలనిపిస్తుంది. కానీ మోక్ష సాధనలో తొందరగా పురోగతి సాధించాలంటే, తొందరగా వైరాగ్యం కలగాలంటే దుఃఖాలు/కష్టాలు అంత మేలు సుఖాలు అందించలేవు. బ్రహ్మ జ్ఞానం తెలుసుకోనంత వరకు దుఃఖం, బాధ, విసుగు, కోపం, చిరాకు, విరక్తి, అసంతృప్తి, పగ, ప్రతీకారం, భయం అనేవి బాధపెడతాయి...

- పూర్తి బ్రహ్మ స్థితిలో ... ఆస్థి ఉన్ననూ అనుభావించాలనే కోరిక కలుగదు, స్త్రీ సుఖం అందుబాటులో ఉన్ననూ మనస్సు చలించదు, పేరు/ప్రఖ్యాతి పొందే అవకాశం ఉన్ననూ ఆరాటపడదు, వస్తువులు/వాహనాలు అందుబాటులో ఉన్ననూ అనుభవించాలనే కోరిక కలుగదు, విచిత్ర, లౌకిక విషయాలు(సోషల్ మీడియా/టీవీ/పేపర్/కబుర్లు) వినపడినా ఆసక్తి చూపించదు.

**నీ దగ్గర ఆయుధం(బ్రహ్మ జ్ఞానం) ఉన్నప్పుడు జీవితంలో ఎన్ని కష్టాలు, ఇబ్బందులు రానీ, నీకేమీ????**

# Part -4 బంధువుల, అనుబంధాలపై, శరీరంపై మమకారం తగ్గించుకోవటం ఎలా?




- ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు, తండ్రి చనిపోయినప్పుడు తమ్ముడు ఎడుస్తుండేవాడు.... (యోగ వాసిష్టం)
- కొడుకు చనిపోయి దుఖంలో ఉన్న రాజు బాధ చూడలేక, నారద మహర్షి ఆ పిల్లాడిని తిరిగి బ్రతికిస్తే...
- చూడాల-శిఖిధ్వజ రాజ్యపాలన... (యోగ వాసిష్టం)
- పేదరికంతో ఉన్న కబీరు దాస్, అతిధులకు కావలసిన సరుకులు కోసం భార్య వ్యాపారితో ఒప్పందం ...

## ఈ జ్ఞానం తెలుసుకొంటే భయం ఉండదా? ధైర్యం ఎలా వస్తుంది?

మరణించినప్పుడు ఈ శరీరం ఎక్కడ కలుపుతారు? నా మట్టిలో నేను కలవడానికి నేను ఎందుకు భయపడాలి?
నన్ను నిప్పులో కాలుస్తారు అంటే? నా నిప్పుతో నన్ను నేను కాల్చుకొంటుంటే నేను ఎందుకు భయపడాలి?
ఒకవేళ ఈ శరీరాన్ని వేరే గ్రహంలో, వేరే వ్యక్తులో ఏదో చేస్తారు అనుకొంటే భయం, నాలో నేను లీలం అవ్వటానికి భయం ఎందుకు?

శ్రీ కృష్ణుడు గాంధారీ నుంచి శాపం పొందితే నవ్వి ఒప్పుకొంటాడు. ఎందుకంటే శాపం ఇచ్చినది ఎవరు, తీసుకొనేది ఎవరు? అది నేనే! అంటే శ్రీ కృష్ణుడు ఆ స్థితిలో ఉండి శాపం పొందినా, శాపాన్ని అనుభవిస్తున్నా అదే ప్రశాంతతతో, ధైర్యంతో ఉన్నాడు.

ఒక జ్ఞాని స్మశానంలో వుటుంటాడు, అందరూ భయపడేవాళ్ళు, కానీ అతను ధైర్యంగా ఉండటంతో దేవత ప్రత్యక్షమై వరం కోరుకోమంతుంది, అతను నవ్వుతూ ఈ ఎడమ కాలికి బోద ఉంది, దానిని కుడి కాలికి మార్చు. అదేమిటి అలా కోరుకోన్నావు అంటుంది, వరాలు ఇచ్చేది ఎవ్వరు "నేనే", తీసుకొనేది ఎవరు "నేనే". నా వరాలు నాకు ఇస్తుంటే ఏమి కోరుకోవాలి అని అంటాడు.




"నేను" నన్ను కాల్చుకొంటున్నాను. అగ్నిలో గల "నేను", శరీరంలో గల "నేను" ని, కట్టెలలో గల "నేను" తో కాల్చుకొంటున్నాను.

# కొందరు దుర్మార్గంగా ఉన్నప్పటికీ మంచి జరుగుతుంది, సుఖాలు అనుభవిస్తుంటారు, ఎందుకని?




దీనికి కారణం గత జన్మ లో చేసుకొన్న పుణ్యం మాత్రమే! ఆ పుణ్యం అయిపోగానే కష్టాలు దారుణంగా ఉంటాయి. ఇదే విషయం ప్రహ్లాదుని తండ్రి అయిన హిరణ్యకశిపుడు చేసే దుర్మార్గాలను తట్టుకోలేక విష్ణుమూర్తిని ప్రార్ధిస్తే ప్రస్తుతం హిరణ్యకశివుడు చేసిన తపస్సు, పుణ్యం అనేది ఇంకా ఉంది, అలాగే నా భక్తులను ఇంకా కష్టాలు పెట్టితే ఇంకా పాపం పెరిగి పుణ్యం పోయేదాకా మనం ఏమీ చేయలేము, కావున ఓర్చుకోవాలి అంటాడు. ఎప్పుడైతే పుణ్యం నశించిందో సర్వవ్యాప్త విష్ణుమూర్తి స్థంభం నుంచి వచ్చి సంహరిస్తాడు.

కావున గత జన్మలో వున్న పుణ్యం కారణంగా దుర్మార్గులు పాపం చేసినా కలిసివస్తుంది, మంచే జరుగుతుంది, వాళ్లదే చెల్లుబాటు అవుతుంది అని మనం వారిలాగా తప్పులు చేయటం మొదలుపెడితే అంటే పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్టు పాపం మూటకట్టుకోవాలి జాగ్రత్త!

## Part -4 సమాజంలో దుర్మార్గం, అన్యాయం, ఘోరాలు చేయటం చూస్తుంటాము, ఎలా?

ఈ సృష్టిలో ఆకు కదిలినా కూడా కర్మ ప్రకారమే జరుగుతుంది. అంత ఖచ్చితంగా కర్మ అమలు ఆగుతుంది. ఎవరి వారి ప్రారబ్దం అనుసరించి వారు ఫలితం పొందుతున్నారు. ఈరోజున ఘోరమైన నేరం చేసిన అతను మరో జన్మలో, మరో వ్యక్తిచేతిలో అన్యాయం/ఘోరం చేయబడతాడు. అప్పుడు మనకు ఆ అన్యాయం అవబడ్డ వ్యక్తిపై సానుబూతి ఉంటుంది, ఎందుకంటే ఆ వ్యక్తి గత జన్మలో చేసిన కర్మలు తెలియవు కావున.




ఇది కలియుగం అంటే దాదాపు భూమి యొక్క ఆయుస్సు 91% పూర్తి అయినది. అంటే చివరి దశలో ఉన్నది కావున విలువలు వేగంగా పడిపోతుంటాయి. నేరాలు, ఘోరాలు పెరుగుతాయి.

# కోరికలు ఎలాంటివి అంటే?

మనస్సు తాను నిర్మించుకున్న గూటిలో తానే చిక్కుకున్నట్లు, మనస్సు నుంచి పుట్టిన కోర్కెలు, సంకల్పాల వలన తానే బంధించుకొంటున్నది.

**ఉదాహరణ:** తన భార్య డప్పు కొడుతుంటే పోతురాజు ఒక పెద్ద తాడుతో తనను తాను కొట్టుకుంటూ బిక్షం అడగటం. అలానే మనస్సుతో లేని పోనీ కోరికలు పెంచుకోవటం, దానిని చేయలేక, సాధించలేక ఏడవటం, దుఃఖం చెందటం, అంటే కోరికలు పెంచుకోవటం ఎందుకు? ఏడవటం ఎందుకు? అంటే కోరికలతో తనను తాను కొట్టుకొన్నట్లే కదా?



**కోరిక ఎలా కలుగుతుంది?**

ఆత్మ జ్ఞానం లేకపోవటం --> ఆ వస్తువు,పదార్థం, వ్యక్తి వేరు - నేను వేరు అనే పోలిక ---> కావున పొందాలి -->అసంతృప్తి -->కోరిక కలగటం

**కోరిక ఎలా కలుగదు?**

ఆత్మ జ్ఞానం తెలియటం వలన -->ఆ వస్తువు,పదార్థం, వ్యక్తి - నేను ఒక్కటే అని విచారణ చేసి --> సంతృప్తి --> కోరిక కలగకపోవటం

# వింతలు, విచిత్రాల ఆకర్షణ నుంచి బయటపడటం ఎలా?

ఒక యోగి ఒక సరస్సు ఒడ్డున తపస్సు చేసుకొంటూవున్నాడు, ఆ చెట్టునుంచి ఒక ఆకు క్రిందపడి ఆకులో సగం చేపగాను, మరో సగం పక్షిగాను మారినది. చేప నీటిలోకి పోవుటకు ప్రయత్నం చేస్తుంది, పక్షి ఎగురటకు ప్రయత్నం చేస్తుంది. ఈ వింత, ఆశ్చర్యం చూస్తూ యోగి తపస్సు చేయటం మానివేసెను. అలాగాక ఆకు, చేప, పక్షి అంతా "సర్వ వ్యాప్త నేనే". అంటే "నేను" అంతటా ఉన్నాను, అలాగే నాకు సర్వ శక్తి, సర్వ విజ్ఞత ఉంది, అందులో ఒక ఆకు చేపగా, పక్షిగా మారటం గొప్ప ఏముంది అని మనస్సుని విచారణ వైపు మళ్లిస్తే తపస్సు చెడిపోయేది కాదు.

అలాగే ఈనాడు 5నిముషాలు ఫోన్ లేకుండా ఉండే పరిస్థితి, కళ్ళముందు 4K HD టీవీ వచ్చినా,3D సినిమా చూసినా, ఏదైనా ఒక గాడ్జెట్ ఓ మంచి పని చేసినా, రోబో కనిపెట్టినా, ఓ మంచి వస్తువు ఒక ప్రయోజనం కోసం కనిపెట్టినా, మంచి గ్రాఫిక్స్ తో కూడిన యాక్షన్ సినిమా చూసినా అది నా సర్వ శక్తి, సర్వ విజ్ఞత యొక్క గొప్పదనమే, అది నేనే. నీది కానప్పుడు వింత, మేజిక్ లు నిన్ను ఆకర్షించాలి, నీవే అవన్నీ అయితే ఆశ్చర్యపోవలసినది ఏమీ లేదు. మనస్సుని దానిని చూడాలని, పొందాలని, అనుభవించాలని కోరుకోకు.



**Part -4** **అవసరం లేని, ఉపయోగం లేని విషయాలపట్ల, వస్తువుల పట్ల, వ్యక్తుల పట్ల జాగ్రత్త!**



తపస్సు చేస్తున్న ఋషికి ఇంద్రుడు వచ్చి ఒక కత్తి ఇచ్చి దీనిని జాగ్రత్తగా కాపాడమని కొన్ని రోజుల తర్వాత తీసుకొంటాను అని చెప్పాడు, ఇంద్రుడు  చెప్పాడు కదా అని దానిని ఋషి ఎక్కడికి వెళితే అక్కడికి తీసుకెళ్లటం జరిగేది, కత్తి చేతులో ఉండటం వలన దారిన పోయే చెట్లను నరికివేయటం జరిగేది. అలా కోపం అనే గుణం పెరుగుతూ వచ్చి జంతువులను కూడా హింసించటానికి ఉపయోగించాడు. అలా ఆ తపస్సు చెడిపోయింది. అందువలన అక్కరలేనివి/అనవసరమైనవి  తీసుకోరాదు, కొనరాదు. ఇవి ఇంట్లో ఉంటే తెలియకుండానే వాటిని వాడాలని, చూడాలని కోరిక కలిగి సమయాన్నివృధా చేసుకోవటం జరుగును.

ఈ రోజుల్లో చేతిలో స్మార్ట్ ఫోన్ ఉంచుకొని మనో నిగ్రహం సాధించాలంటే చాలా కష్టం! కొంచెం సేపు చూద్దాములే అని అనుకొంటాము, అది నిదానంగా సమయాన్ని మొత్తం తీసుకొని, వ్యసనంగా మారును. ఒకసారి వ్యసనం అయితే మానుకోలేము!

ఆత్మ జ్ఞానంతో ఆ ఆకర్షించే విషయాలు, వింతలు, విచిత్రాలు అన్నీ నేనే అయినప్పుడు వాటి గురించి తెలుసుకొనేది ఏముంది అని మనస్సుని వాటిపైకి వెళ్ళకుండా కంట్రోల్ చేయాలి!







Part -4 ఆత్మజ్ఞానం తెలుసుకొంటే పని చేసేటప్పుడు నాణ్యత పెరుగుతుందా? తగ్గుతుందా?










"నా" పని నేను చేసుకొంటున్నాను. అంటే మురికిగా ఉన్న పాత్రలలో ఉన్నది "నేనే", కడిగే వ్యక్తిలో ఉన్నది "నేనే". మురికిగా ఉన్న రోడ్ "నేనే", మురికిని "నేనే", ఊడ్చే వ్యక్తిని "నేనే", కావున నా మురికిని నేను శుభ్రం చేసుకొంటున్నాను. కంప్యూటర్ "నేనే", పనిని "నేనే", చేసే వ్యక్తిని "నేనే". నా పనిని నేను చేసుకొంటున్నప్పుడు ఎందుకు బద్ధకం, అసంతృప్తి వస్తుంది. సాధారణంగా ఒక పని చేసేటప్పుడు చేయబడే పని అనేది "వేరు" అనే భావన ఉన్నప్పుడు ఇష్టం అయితే ఆకర్షణ ఉంటుంది, అయిష్టం అయితే వికర్షణ వస్తుంది. "నా" పని అనుకొంటే చేసే పని ఎంతటి కష్టంగా ఉన్నా, మురికిగా ఉన్నా అయిష్టం రాదు. కారణం "నా" పని నేను చేసుకొంటున్నాను అనే భావన ఉంటుంది.

తల్లి తన పిల్లల మల,మూత్రాలను పట్టుకోవడానికి కారణం "నా". అంటే నా కొడుకు/కూతురు. అదే తల్లి వేరే పిల్లల మల,మూత్రాలను పట్టుకోలేకపోవటానికి కారణం ఆ పిల్లలు "వేరు". కానీ ఇతరుల మలమూత్రాలను పట్టుకొన్నప్పుడు ఆ మలమూత్రాలు "నేనే", ఆ వ్యక్తి లో ఉన్నది "నేనే" అనే భావన ఉన్నప్పుడు తల్లి పిల్లలకు చేసినట్టు సేవ చేయవచ్చు.

Part -4 **ఆత్మ జ్ఞానం, బ్రహ్మ జ్ఞానం తెలుసుకొంటే కోరికలు/ఆలోచనలు ఎలా తగ్గుతాయి?**

సినిమా స్టార్ అవ్వాలని ఉంది → సినిమా స్టార్ లలో ఉన్నది నేనే, ఆ నటన నేనే, ఆ పోస్టర్ నేనే, డైరెక్టర్ నేనే, కీర్తి నేనే

పలానా వాళ్ళకు కారు ఉంది, కొంటే బాగుండు → ఆ కార్ నేనే, ఆ వ్యక్తిని నీనే, అనుభవిస్తున్నది నేనే

పలానా వాళ్ళకు ఇల్లు ఉంది, కడితే బాగుండు → ఆ ఇల్లు, ఇటుక నేనే, ఆ వ్యక్తిని నేనే, ఇప్పుడు ఇల్లు నేనే, ఇది సరిపోతుంది, ఈ శరీరానికి ప్రారబ్దం ఉంటే ఇల్లు కట్టుకొనే స్తోమత వస్తుంది.

నా పేరు పేపర్ లో పడాలి → పేపర్ లో పడే ప్రతి వ్యక్తీ లో ఉన్నది నేనే, ఆ పేపర్ కూడా నేనే, పేపర్ లో గల రంగు నేనే, అక్షరం నేనే

CM అయితే బాగుండు → ఇప్పుడు ఉన్న CM లో ఉన్నది నేనే, రాబోయే CM లో కూడా ఉండేది నేనే, ఆ పదవి నేనే, ఆ పదవి పేరు నేనే

నాకు పచ్చడి ఇష్టం లేదు, పప్పు తినాలి → పచ్చడి లో ఉన్నది ఎవ్వరు? నేనే, పచ్చడి లోని కారం ఎవరు? నేనే. పప్పు ఎవరు? నేనే. అంటే పచ్చడి, పప్పు కంటే వేరుగా ఉందా? లేదు. కావున రుచి కోరిక తగ్గును.

కోరికలు కలగాలంటే నీకన్నా మరొకటి ఉండాలి, వేరుగా ఉండాలి. ఈ సృష్టిలో నీవు తప్ప ఇంకొకటి లేనప్పుడు దేనిని కోరాలి?

ఒకవేళ ఏమైనా కోరిక ఉంటే అది నెరవేరడం కోసం జన్మ ఎత్తాలి..
చింతపండు పచ్చడి అంటే ఇష్టం, అది లేకపోతే ప్రాణం గిలగిలలాడును, కావున చింతకాయలో పురుగుగా అనుభవించాలి...
పలానా వ్యక్తీ మీద పగ, దానిని తీర్చుకోవటం కోసం కొడుకుగా/కూతురుగా, భార్యగా/భర్తగా, అన్నతమ్ములుగా దగ్గరుండి వేధిస్తారు...
కొడుకు అంటే ఇష్టం, వాడి గురించే ఆలోచిస్తాను, ప్రాణం పోయేటప్పుడు కూడా కొడుకు గురించే తలస్తే, కొడుకుకి అవసరమైన ఏదో ఒక దానిగా జన్మ...

# పురుష ప్రయత్నం ఎందుకు?




## పురుష ప్రయత్నంతో ఆత్మజ్ఞానం/బ్రహ్మ జ్ఞానం ఎందుకు వినాలి అంటే?

### పురుష ప్రయత్నం గెలవాలి కాబట్టి

**వినటం వలన --> జ్ఞానం పెరిగి --> అసంతృప్తి తగ్గి, సంతృప్తి పెరుగును --> తద్వారా కోరికలు కలుగవు ---> కోరికలు "0" అగును**

## Part -4 కోరికను బలవంతంగా అణచటం, కోరికను తీసివేయటంకు మధ్య తేడా?

బలమైన కోరిక

బలవంతంగా అణచటం

నిదానంగా కోరిక పెరగటం
(అవకాశం వచ్చినప్పుడు, పరిస్థితులు అనుకూలించినప్పుడు)



ఆత్మ జ్ఞానం

కోరికను మూలం నుంచి తీసివేయటం

**ఉదాహరణ:** డబ్బులు లేక మామిడికాయ తినలేదు అనుకోవటం కాదు, అది అణచటం. ఎప్పుడైనా తగినంత డబ్బులు ఉంటే మామిడికాయ తినాలనిపిస్తుంది డబ్బులు ఉన్నా, మామిడికాయ తినాలనిపించకపోవటం విచారణ. కోరికను మూలం నుంచి తీసివేయటం

# Part -4 ఆలోచనలను ఆత్మ జ్ఞానంతో ఫిల్టర్ చేస్తే సున్నా(0) అవుతాయి!



**Part -4** ## ఆత్మ జ్ఞానం తెలుసుకొన్న తర్వాత ఎలా ఉండాలి?

- నిరంతరం "నేను బ్రహ్మం, సర్వం బ్రహ్మం, అన్ని పనులు బ్రహ్మంలోనే, బ్రహ్మమే చేస్తుంది, అలాగే ఈ శరీరాన్ని పరికరంగా కూడా చేసుకొని చేస్తుంది" అనే ఆలోచన ఉండాలి!
- క్రొత్తలో, ప్రతీసారీ బ్రహ్మర్పణం చేయలేకపోతే రోజుకు ఒకసారి అయినా "ఈ శరీరమే నేను అనే భావనతో చేసిన పుణ్య, పాపం మొత్తం బ్రహ్మర్పణం చేస్తున్నాను" అని అనుకోండి!
- అంటే కొన్నిరోజులు మొదట్లో "నేను బ్రహ్మన్ని, కానీ నేను శరీరం అనే భావనతో ఈ రోజు చేసిన సర్వ పుణ్యం, పాపం బ్రహ్మర్పణం చేస్తున్నాను" అని అనుకోండి.
- శరీర ధర్మం, సృష్టి ధర్మంను(ఆత్మ జ్ఞానాన్ని) కలపవద్దు. అంతా బ్రహ్మమే కదా అని బంగారం షాప్ లో ఉన్న బంగారం నాది అనకండి, కారం నేనే కదా అని నోట్లో పోసుకొని కారం ఏమీకాదు అనకండి, మురికి నేనే అయినా అది శరీరానికి అంటుకొంటే రోగాలు వస్తాయి, సూక్ష్మజీవులకి నీవు బ్రహ్మం అని తెలియదు కాబట్టి వాటి పని అవి చేసి రోగాన్ని కలిగిస్తాయి. అంటే మనస్సులో అంతా బ్రహ్మం అనే ఆలోచనలతో ఉండాలి, బయటికి శరీర ధర్మం ఏది అయితే అది చేయాలి!
- ప్రారబ్దం ప్రకారం ఈ శరీరానికి ఏమి దక్కాలో పుట్టినప్పుడే నిర్ణయం అయింది, ప్రాప్తం అయినది ఎట్టి పరిస్తితులలలో అయిననూ వస్తుంది.. ఎందుకంటే ప్రారబ్దం లో లేనిది ఎంత ప్రయత్నం చేసిననూ రాదు, అలాగే అది వాసనగా మారును. ప్రారబ్దం ప్రకారం కారు, ఇల్లు, మంచి భోజనం తినే యోగం ఉంటే అనుభవించండి, కానీ అవి అన్నీ బ్రహ్మమే/నేనే. బ్రహ్మం లోనే జరుగుతున్నాయి. అంటే కారు వచ్చింది సంతోషమే! కారు అమ్మేయాల్సివచ్చింది సంతోషమే! పెద్ద ఇల్లులో ఉండాలి సంతోషమే, పూరి గుడిసెలో ఉండాలి సంతోషమే! అంటే అంతా బ్రహ్మం అయినప్పుడు సుఖం, దుఃఖం అంతా ఒకేలా చూడాలి! ఇది మనస్సులో ఉండాలి!
- బ్రహ్మనుభూతి కలుగక పోవటానికి కారణం, గత సంచితం ఎంత వుందో తెలియదు, కావున బ్రహ్మ భావన సాధన ద్వారా సంచితం తరిగేదాకా చేస్తూ ఉండాలి!
- నేను బ్రహ్మం/ఆత్మ/దేవుడు, నా సృష్టి ధర్మం నిర్వహించటానికి ఈ భూమిపై పుట్టాను.
- నాకు ఇష్టమైన వంట, వస్తువు, ఉద్యోగం, వ్యక్తి అంటూ ఏమీ లేదు. ఏది వచ్చినా బాధపడను, ఏది పోయినా బాధపడను.
- ఆత్మజ్ఞానం తెలిసింది కదా అని సన్యాసిలా ఉండనవసరం లేదు. జనకమహారాజులా గృహస్తు ధర్మం చేస్తూ జ్ఞానిగా ఉండొచ్చు.
- నీకు స్వీట్ ఇచ్చారు, ఆ తీపిదనం నేనే కదా! రుచిని ఆస్వాదించు. మళ్ళీ మళ్ళీ తినాలనుకోవటం తప్పు.
- కాలికి గాయం అయింది, ఈ శరీర ప్రారబ్దం ప్రకారం గాయం అయింది, అనుభవించనీ, ఏడవనీ. నా కర్మ నుంచి ఎవ్వరూ తప్పించుకోలేరు, అనుభవిస్తేనే పోతుంది. దుఃఖం ద్వారా కర్మ తగ్గుతున్నప్పుడు బాధపడటం దేనికి!
- **కర్తవ్యం:** నా పిల్లలకి/భాగస్వామికి పలానా పని చెప్పాను, కానీ చేయలేదు, చెప్పటం నా కర్తవ్యం, వినటం అనేది వారి ప్రారబ్దం. ఎదుటివ్యక్తి వారి వారి ప్రారబ్దం బట్టి నిర్ణయం తీసుకొంటారు. చెప్పటమే మన కర్తవ్యం. కృష్ణుడు యుద్ధం ఆపటానికి కర్తవ్యంగా సంధి ప్రయత్నాలు చేసినట్టు చేయటమే!
- **ఇంద్రజాలికునిలా:** Magician తన మేజిక్ తో భ్రమ(కల్పితం) చేస్తాడు, అది చూసేవారు ఓహో, అనందం తో చప్పట్లు కొడుతారు, కారణం సత్యం తెలియదు. కానీ చేసే మేజిక్ ఎవరికైనా తెలిస్తే వారు స్పందించరు ఎందుకంటే వారికి ఎలా చేస్తారో తెలుసు కాబట్టి. ఎవరైతే ఆ మాజిక్ ఎలా చేశారో తెలియదు కాబట్టి ఏదో గొప్పదనం వుంది అనుకొంటారు, కానీ ఇంద్రజాలికునికి, మేజిక్ తెలిసినవారికి నవ్వురాదు, ఎందుకంటే అది తనకు తెలుసు ఎందుకు అలా భ్రమ కలిగిందో. మేజిక్ తెలియని వారు అద్భుతంలా చూస్తారు. ఈ పుస్తకం ఆత్మజ్ఞానంని తెలియచేస్తుంది ఈ సృష్టి మేజిక్ చేసేవారు ఎవరు? ఎందుకు చేస్తున్నారు? అనే సత్యం తెలిసిన కొందరు ప్రశాంతంగా ఉంటారు, తెలియని వారు బాధతో ఉంటారు.
- **శ్రీరామునిలా ఉండు:** శ్రీ రామునిలా ఆత్మజ్ఞానం తెలుసుకొని, ప్రారబ్దాన్ని అనుభవించటమే! (మీకు తెలుసా శ్రీరామ చంద్రుడు పెళ్లికాక ముందే బ్రహ్మజ్ఞానం విన్నాడు?)

## ఈ జ్ఞానం తెలుసుకొన్న తర్వాత మీ ఆలోచనలలో మార్పులు గమనించండి............

ఈ జ్ఞానం తెలుసుకొన్న తర్వాత పూజ గదిలో కూర్చుని భగవంతుని ఏమి కోరాలో అర్థం కాక, నవ్వుతుంటావు, ఎందుకంటే వరం ఇచ్చేది నువ్వే, అడిగేది నువ్వే!

ఇప్పటివరకు భగవంతుని ఫోటో లో దేవుడు గొప్పవాడు, అతను వేరు అనే భావన ఉండేది. భయం ఉండేది! కానీ ఇప్పుడు నీ దృష్టి కోణంలో ఎదురుగా పూజింపబడిన మూర్తిలో ఉన్నది నేనే, పూజించే వ్యక్తిని నేనే అనే భావన కలుగుతుంది.

ఒక సోఫా ముట్టుకున్నా, దుప్పటి ముట్టుకొన్నా, మురికిని చూసినా, వ్యక్తిని చూసినా, పక్షిని చూసినా, పాముని చూసినా, సూర్యుని చూసినా, కడుపున పుట్టిన పిల్లలను ముట్టుకొంటే ఎలా ఆప్యాయత, ప్రేమ కలుగుతుందో ఆ భావన నీలో కలగటం మొదలవుతుంది, ఎందుకంటే అవి అన్నీ నా రూపాలే, నేనే! మనస్సు నిండా ఎంతో సంతోషం, ఆనందంతో నిండిపోతుంది.

ఒక కష్టం వస్తే ఒకప్పుడు బాధపడుతూ భగవంతుడా కాపాడు అని ఏడుస్తూ ఉండేవాడివి, కానీ ఇప్పుడు ప్రారబ్దం అనేది నా సృష్టి నియమం, ఈ శరీరం లో ఉన్న నేను ఈ ప్రారబ్ధాన్ని అనుభావిస్తున్నాను. నా నియమం నేను పాటించకపోతే ఎలా? నేను నా ప్రారబ్ధాన్ని పాటించకుండా తప్పించుకోవటానికి ప్రార్థించటం ఏమిటి? ఒకవేళ భగవంతుడు ప్రత్యక్షం అవ్వాలి అంటే ఎవరు అవ్వాలి? అది నేనే కదా! కావున ఒక వైపున ప్రారబ్ద కష్టం ఈ శరీరాన్ని బాధ పెడుతున్నా, మరో వైపు నా సృష్టి ధర్మం నాకు గుర్తుకు వచ్చి నవ్వుతూ ఉండటం జరుగును.

నా కళ్ళ ముందు ఇప్పుడు మంచి, చెడు బేధం కనిపించటం లేదు. ఉన్నదంతా మంచే! ఎందుకంటే ఈ సృష్టిలో ప్రతీది నేనే అయినప్పుడు, ఒకటి మంచి-చెడు అని ఉంటుందా? అంటే ఈ శరీరంలో వివిధ రకాల అవయవాలు, జీవులు ఉన్నాయి. అవి చెడు అందామా? ప్రతి దానికి ఒక ఉపయోగం ఉంది. అలాగే నా సృష్టి ధర్మం కొనసాగించుటకు నాకు నేనే అహంకార, మమకార, ద్వేషం, పగ, ప్రేమ అనేవి కలుగచేసుకొని నన్ను నేను నడిపిస్తున్నాను. అలాంటప్పుడు ఎవరిని తిట్టాలి? నన్ను నేను తిట్టుకోనా? ఎందుకంటే ఇది నా/బ్రహ్మం సహజ ధర్మం కదా!

ఏమి కోరుకోవాలో అర్థం కాదు, అన్నీ నేనే అయినప్పుడు ప్రత్యేకంగా ఏమి కోరలేవు. కావున ఈ శరీర ప్రారబ్దానికి ఏది వస్తే అది తీసుకొంటూ ముందుకు వెళ్తుంటావు...................

# ఆత్మ జ్ఞానాన్ని ఆచరణలో చేసేటప్పుడు అతి తెలివి వద్దు!

నేను సర్వ వ్యాప్తంగా ఉన్నాను కదా అని బంగారం షాప్ లో గల వ్యక్తిలో కూడా నేనే ఉన్నాను అని ఆ షాప్ నాది అని అనటం మూర్ఖత్వం అవుతుంది.
ఈ శరీరంలోని "సర్వ వ్యాప్త నేను", బంగారపు షాప్ లోగల "సర్వ వ్యాప్త నేను" ఒకటే! మరి తప్పు చేస్తే, నేరం చేస్తే నన్ను నేను శిక్షించుకొంటాను అన్నది కూడా నేనే కదా. అంటే చట్టాలలో అన్యాయం, అధర్మం చేస్తే నన్ను నేను శిక్షించుకోవటానికి నేనే రాసుకున్నాను కదా, అప్పుడు ఆ జడ్జి రూపంలో ఉన్న నేను, నేరం చేసిన నేనుని శిక్షిస్తాడు అది కూడా ఒప్పుకోవాలి కదా! కావున ఆత్మజ్ఞానాన్ని అతి తెలివి కోసం ఉపయోగించకుండా మనస్సుని కంట్రోల్ చేసుకోవడానికి మాత్రమే ఉపయోగించండి.

ఒకసారి ఆత్మజ్ఞానం గ్రంధాన్ని చదివిన సాధకుడు ఏనుగు వస్తుంటే దానికి ఎదురుగా వెళ్తాడు, మావటి అతనిని ప్రక్కకు వెళ్ళమంటే ఏనుగులోగల నేను, శరీరంలో గల నేను ఒక్కటే అన్నాడు, ఏనుగు అతనిని తొండంతో విసిరికొట్టింది, దూరంగా పడి మూలుగుతుంటే ఆ మావటి మళ్ళీ అడుగుతాడు నేను చెపుతున్నా ప్రక్కకి ఎందుకు వెళ్ళలేదు అని అంటాడు, అందుకు ఆ సాధకుడు ఈ శరీరంలోని నేను, ఏనుగులో గల నేను ఒక్కటే గదా! అంటాడు.
అప్పుడు ఆ మావటి నేను కూడా చెప్పను కదా, ప్రక్కకు త్రప్పుకోమని, మరి నా శరీరంలో నేను కనపడలేదా? అని అడిగాడు. కావున సర్వ వ్యాప్త నేను దృష్టికోణంలో చూసేటప్పుడు ఇలాంటి తప్పటడుగులు పడకుండా సర్వాన్ని "నేను" గా చూడాలి, అంతేగానీ అందులో నీకు నచ్చినదాన్ని "నేను" గా, మిగిలినవి "వేరు" గా చూడరాదు.






# Part -4 ఒత్తిడి తగ్గాలంటే కర్తృత్వం వదిలేయి

ఒక రాజు ఓ జ్ఞాని వద్దకు వెళ్లి.. నేను ప్రశాంతంగా ఉండలేకపోతున్నాను" అన్నాడు..

"నువ్వు నీ బాధ్యతలు సరిగ్గా నిర్వర్తించడం లేదా?" అడిగారు ఆ జ్ఞాని.

"మా రాజ్యానికి శత్రు భయం లేదు. దొంగల భయం లేదు. మా రాజ్యంలో పన్నులు తక్కువే. న్యాయ వ్యవస్థ కూడా బాగుంది. ఎక్కడా ఎవరికీ అన్యాయం జరగదు. ప్రజలందరూ ఆనందంగా ఉంటున్నారు. కానీ నాకే ప్రశాంతత లేదు. నేను ఏం చెయ్యాలి" రాజు ప్రశ్నించాడు.

"సరే నీ బాధ అర్థమైంది. నేనొకటి చెప్తాను. అలా చెయ్యి. నీ రాజ్యాన్ని నాకు ఇచ్చేసెయి" అన్నారు జ్ఞాని.

"అంతకన్నా ఇంకేం కావాలి....తీసుకోండి..ఈ క్షణమే ఇచ్చేస్తున్నాను నా రాజ్యాన్ని" చెప్పాడు రాజు.

"సరే నాకిచ్చావు. నువ్వేం చేస్తావు?" జ్ఞాని అడిగారు.

"నేను ఎక్కడికైనా వెళ్లి అక్కడ ఏదో ఒక పని చేసుకుంటూ బతుకుతాను" అన్నాడు రాజు.

"ఎక్కడికో వెళ్లడం ఎందుకు? ఇక్కడే నా వద్దే నా ప్రతినిధిగా ఉండి రాజ్య పాలన చేయి. ఓ ఏడాది తర్వాత వచ్చి లెక్కలు చూస్తాను" చెప్పారు జ్ఞాని.

ఒక సంవత్సరం గడిచింది. జ్ఞాని రాజుని చూడటానికి వచ్చారు. రాజు మొహంలో ఆనందం కనిపిస్తోంది. ఎక్కడా ఆవగింజంత దిగులు కనిపించడం లేదు.

"నువ్వు ఇప్పుడు ఎలా ఉన్నావు?" అడిగారు జ్ఞాని.



"హాయిగా ఉన్నాను. కావలసినంత ప్రశాంతత అనుకోండి. మునుపెప్పుడు ఇంత హాయిగా లేను. మీకు నా ధన్యవాదాలు" అన్నాడు రాజు.

"సరేగానీ పూర్వం నువ్వు చేసిన పనులకు, ఇప్పుడు నువ్వు చేస్తున్న పనులకు ఏవైనా తేడాలు తెలిసాయా?" అడిగారు జ్ఞాని.

"లేదు. అప్పుడు చేసే పనులే ఇప్పుడు కూడా చేస్తున్నాను " రాజు సమాధానమిచ్చాడు.

"అప్పుడు ఎందుకు మానసిక ఒత్తిడికి లోనయ్యావు? ఇప్పుడు ఆ ఒత్తిడి లేదా?" అని జ్ఞాని అడిగాడు

రాజుకి అసలు విషయం తెలిసి జ్ఞాని వంక చూసాడు. అప్పుడు జ్ఞాని ఇలా అన్నారు...

అప్పుడు ఇది నా పని....నా బాధ్యత, నేనే చేస్తున్నాను అని ఆలోచించావు. ఇప్పుడు నువ్వు ఇది నాది కాదు. నేనిక్కడ కేవలం ఒక ప్రతినిధిని అనుకున్నావు.

సర్వం బ్రహ్మమే కావున, ప్రతీ కర్మ బ్రహ్మమే చేస్తుంది, చేయిస్తుంది అని గుర్తిస్తే ఒత్తిడి రాదు. అలాగాక నేనే(రామారావు, సుబ్బమ్మ... ) అనే శరీరమే ఈ పనులను చేస్తుంది అని అనుకొంటే(కర్తృత్వం) ఒత్తిడి వస్తుంది. అలాగే ఏది వచ్చినా ప్రారబ్దం బట్టి దక్కవలసినది ఎట్టి పరిస్థితులలో లభిస్తుంది, ప్రారబ్దంలో లేనిది ఎంత ప్రయత్నం చేసినా పొందలేము! ఫలితం నీ చేతిలో లేనప్పుడు Goal/Target పెట్టుకొంటే, దానిని సాధించలేపోతే ఒత్తిడి వస్తుంది. కావున Goal/Target పెట్టుకోకుండా నీ ప్రయత్నం నీవు చేయి, ప్రారబ్దం ప్రకారం ఎంత ఫలితం రావాలో అంత వస్తుంది!

**Part -4**

# జ్ఞాని vs అజ్ఞాని దృష్టికోణం

“శరీరమే నేను” అనుకోవటం వలన ఇతరులని కూడా శరీరంగా చూస్తున్నావు. అప్పుడు వేరు భావన వస్తుంది, అంటే నీవు వేరు, అమ్మాయి వేరు అనే లింగ భేదం వస్తుంది. ఎప్పుడైతే వేరు భావన వస్తుందో, పొందాలి/ఆకర్షించాలి అనే కోరిక వస్తుంది. కోరిక నెరవేరకపోతే కోపం, దుఃఖం, పగ వస్తుంది.

పగ అనే కోరికను సాధించటం కోసం జన్మ వస్తుంది

అదే "సర్వ వ్యాప్త నేను(సర్వం బ్రహ్మం)" అనుకోవటం వలన ఇతరులలో కూడా నిన్నే చూసుకొంటావు. అప్పుడు వేరు భావన రాదు. అంటే నీ కాలిపై గల చర్మం, చేతిపై గల చర్మం అంతా నీదే అయినప్పుడు నీ చేతిపై గల చర్మంని పొందాలి అనే కోరిక ఉంటుందా?? అలాగే అబ్బాయిలో గల చర్మం, అమ్మాయిలో గల చర్మం నీదే అయినప్పుడు నీ చర్మాన్ని నీవు పొందటం అంటూ ప్రత్యేకంగా ఉంటుందా?

"శరీరమే నేను" అనుకోవటం ==>వేరు భావన ==>పొందాలి/ఆకర్షించాలి అనే కోరిక ==> నెరవేరకపోతే కోపం, దుఃఖం, పగ ==> జన్మ

"సర్వ వ్యాప్త నేను(సర్వం బ్రహ్మం)" అనుకోవటం ==> వేరు భావన ఉండదు ===>కోరిక లేదు ==> దుఃఖం లేదు ==> జన్మ లేదు

"శరీరమే నేను" అనుకోవటం==> వేరు భావన ==>పొందాలి/ఆకర్షించాలి అనే కోరిక ==> నెరవేరకపోతే కోపం, దుఃఖం,పగ ==> జన్మ
"శరీరమే నేను"
"శరీరమే నేను"
(అజ్ఞానం దృష్టికోణం)
శరీరమే నేను
సర్వ వ్యాప్త నేను
(ఆత్మ జ్ఞానం దృష్టికోణం)
దృష్టికోణం
"సర్వవ్యాప్త నేను"
వేరు భావన ఉండదు ===>కోరిక లేదు
"సర్వవ్యాప్త నేను"
"సర్వ వ్యాప్త నేను" అనుకోవటం ==> వేరు భావన ఉండదు ===>కోరిక లేదు ==> దుఃఖం లేదు ==> జన్మ లేదు

# Part -4 ఉద్దేశ్యపూర్వకంగా లక్ష్యాలు(GOAL) పెట్టుకోవద్దు! ఫలితాలు ఆశించవద్దు!




**ఎందుకు లక్ష్యం పెట్టుకోకూడదు?**
ప్రారబ్దం అంటేనే తప్పక అనుభవించాల్సినవి.
ఒక వ్యక్తి యొక్క ప్రారబ్దంలో కారు కొనే యోగం లేదు అనుకో, ఇప్పుడు అతను కారు కొనాలనే కోరిక పెట్టుకొంటే, అది ఈ జన్మలో తీరకపోవటం వలన అది వాసన(తీరని కోరిక) గా మారి, ఆ కోరిక కోసం మళ్ళీ జన్మ ఎత్తాలి.
ఒకవేళ కార్ కొనే యోగం ఉంటే నీవు లక్ష్యం పెట్టుకోకపోయినా ఆ సమయానికి ఆలోచన వచ్చి వెంట వెంటనే జరిగిపోతుంది.

**NOTE: నేను ఏమీ చేయను, మెదలకుండా ఉంటాను అంటే?** ప్రారబ్దం అంటేనే అనుభవించేలా చేసేది, నీవు మెదలకుండా ఉన్నా, ఆ సమయానికి ఆలోచన వచ్చేలా చేస్తుంది. నీవు ఎంత ఆలోచించవద్దు అని అనుకొన్నా, విచిత్రంగా ఆ ఆలోచన పైకి వచ్చి, ఆచరణ అయ్యేలా చూస్తుంది.

**ఒత్తిడికి కారణం:** తన ప్రారబ్దంలో లేని పనులను చేయాలని, సాధించాలని అనుకోవటం.

గమనిక: ప్రస్తుతం ఏమైతే ఆచరణలో చేస్తున్నామో అవి అన్నీ ప్రారబ్దాలే!

ఫలితం అనేది బ్రహ్మం ఇవ్వాలి, శరీరం నేను అనే భావనతో చేస్తే, అనుకొన్న ఫలితం వస్తుందో రాదో అనే ఒత్తిడి ఉంటుంది.

# ప్రారబ్ధం నుంచి తప్పించుకోలేము!



కంప్యూటర్ లో ప్రోగ్రామ్ ఎలా ఒకదానితర్వాత ఒకటి ఎలా అమలుచేస్తాయో అలా

ప్రారబ్ధం(తప్పక అనుభవించాల్సిన మంచి, చెడు పనులు) కూడా అమలు చేస్తాయి.

**నేను ఆఫీస్ కి లేట్ గా వెళ్లి తిట్లు తినాలనేది అనేది చెడు కర్మ(ప్రోగ్రాం):**

టిఫిన్ తిని డ్రెస్ వేసుకొని బైక్ పై వెళ్తూ ఫోన్ వస్తే చెట్టుక్రింద ఆగాను, కాకి రెట్ట వేసింది(చెడు కర్మ) → కాకి తన కర్మకు సహాయం చేసింది

ఇంటికి వచ్చి మరో డ్రెస్ వేసుకొని వెళ్తున్నప్పుడు అనుకోకుండా ట్రాఫిక్ జామ్ వలన మరో అరగంట ఆలస్యం అవటం → ట్రాఫిక్ జామ్ తన కర్మకు సహాయం చేసింది

ఆలస్యంగా ఆఫీస్ కి వెళ్ళటం, అనుకోకుండా ముఖ్యమైన మీటింగ్ పెట్టటం, దానికి హాజరవనందుకు, బాస్ వలన తిట్లు → బాస్ తన కర్మకు సహాయం చేశాడు

కర్మ ఎప్పుడు పోతుంది అంటే అనుభవిస్తేనే పోతుంది, అంటే బాస్ తిట్లకు బాధపడాలి, అప్పుడే పోతుంది.

కానీ కర్మ అనుభవించేటప్పుడు దుఃఖం అదుపుచేయాలంటే అందుకు రెండు పద్ధతులు ఉన్నాయి.

పద్ధతి 1) రమణమహర్షి చెప్పినట్టు "ఈ శరీరం తప్పుచేసింది, అనుభవిస్తుంది" అనే జ్ఞానం తో ఆలోచిస్తే, ఆ తిట్టిన తిట్లు నిన్ను బాధించవు.

ఎందుకంటే నీవు బ్రహ్మానివి, శరీరం కాదు. ఈ శరీరం ఏ పాపం చేసిందో ఇప్పుడు అనుభవిస్తుంది అనుకొంటే, తిట్లు బాధించవు.

పద్ధతి 2) అలాగాక రమణమహర్షి చెప్పినట్లే ఇంకో పద్ధతి సర్వం బ్రహ్మం, అంటే బాస్, ఈ శరీరం కూడా బ్రహ్మమే!
అంటే నిన్ను నీవు తిట్టుకొంటే కోపం వస్తుందా? రాదు కదా?. ఈ పద్ధతిలో బ్రహ్మం, బ్రహ్మాన్ని తిట్టుకొంటే కోపం ఎందుకు వస్తుంది!
అంటే నా పళ్ళు, నా నాలికను కరిస్తే, నేను పళ్ళను కొడతానా?

## అందరూ ఎందుకు ఆత్మ జ్ఞానం తెలుసుకోలేకపోతున్నారు?




## కొందరే ఎలా ఆత్మజ్ఞానం తెలుసుకోగలుగుతున్నారు?

దుఃఖాలు(శారీరక, మానసిక బాధలు కలుగటం/చూడటం)
సాధనా బలం(ఇంతక ముందే భక్తి, కర్మ, జ్ఞాన సాధన పూర్తి చేయటం)
ప్రారబ్దంలో ఎక్కువ కష్టాలు – ఎక్కువ సుఖాలు ఉండటం

వైరాగ్యం(జీవితంపై అయిష్టం, ప్రపంచం పై అయిష్టం)
(అనిత్యం, దుఃఖంతో కూడినదే ప్రపంచం అని తీవ్రంగా ఆలోచించటం/గుర్తించటం )

ముముక్షుత్వం(తీవ్రమైన అవసరం)
(మోక్షం పొందాలనే తీవ్రమైన కోరిక, దుఃఖం నుంచి విముక్తి పొందాలనే కోరిక )

శ్రద్ధ(గురువు, శాస్త్రం మీద నమ్మకంతో వినటం, చదవటం జరుగును) కలుగును
ప్రారబ్దం పై నమ్మకం కలుగటం(ఏది ప్రాప్తం అయితే అదే వస్తుంది అనే నమ్మకం)

తితీక్ష(సుఖ దుఖములకు, ఆకలిదప్పులకు, అవమానం నందు, ప్రాపంచిక విషయాల పట్ల చలించకుండా ఉండుట) – ప్రతి ఆలోచనను విచారణ చేసి బ్రహ్మంగా మలచుట

ఉపరతి(నిరంతరం మనస్సును బ్రహ్మం నందే ఉంచుట)
(ప్రపంచంలోని ప్రతీది బ్రహ్మమే అనే విశ్వాసం/అంతా బ్రహ్మం నందే జరుగుచున్నది)
**Ex: బ్రహ్మమే వంట చేస్తున్నది, బ్రహ్మమే ఫ్యాన్ గా ఉంది, బ్రహ్మమే కోప్పడుతుంది...**

మనో నాశనం(శాశ్వతంగా ఆలోచనలను రాకుండా ఉండుట) + సాక్షిత్వం + యాంత్రిక కర్మ
(నేను బ్రహ్మం/సర్వం బ్రహ్మం అనేది మాత్రమే గుర్తు వుండి, మిగిలిన ఏ ఆలోచనలు లేని స్థితి)
(Ex స్త్రీ కి పురుషునందు ప్రేమ ఉంటే, పనులు చేస్తున్నప్పటికీ పురుషునిపై ధ్యాస)
బస్సులో ప్రయాణం చేస్తుంటే నీకు ఒక బ్యాగ్ ఇస్తే, దానిపై మమకారం, అహంకారం లేని – యాంత్రిక కర్మ
రెంట్ ఇంట్లో ఉన్నావు, దానిపై మమకారం, అహంకారం లేదు – యాంత్రిక కర్మ
స్నేహితుల ఇంటికి వెళ్ళాము, అక్కడున్న రోజులు వారి ఇంటిపై, వారి వస్తువులపై మమకారం లేదు - యాంత్రిక కర్మ

Part -5

# వైరాగ్యం(అయిష్టం)



వైరాగ్యం(అయిష్టం) – నిద్రలో ఎలా అయితే ఆలోచనలు రావో, అలా మేల్కొని ప్రపంచంలోని విషయాలను చూసినా ఏ మాత్రం విషయ చింతన రాకూడదు

సత్యాన్ని అంగీకరించాలి – ఈ సృష్టి/భూమి అనేది పుట్టింది, దివ్య యుగం వయస్సు 43 లక్షల సంవత్సరాలు, అందులో 4,32,000 సంవత్సరాలు మిగిలి ఉంది, దీనినే కలియుగం అంటారు, అది 4,32,000 సంవత్సరాలకు నాశనం అవుతుంది, ఇదే సృష్టి ధర్మం.

పుట్టింది అంటే మరణించాలి – నామం, రూపంతో ఉండేది ప్రపంచం, ఇది అంతా ఓ రోజు నాశనం అవ్వాల్సిందే!

Pre Planned Failure – 4,32,000 సంవత్సరాలకు కలియుగం నాశనం అవ్వాలని ముందే నిర్ణయం అయ్యి ఆ ప్రకారం సృష్టిలో ధర్మం అనేది తగ్గిపోతూ దుర్మార్గం పెరిగి నాశనం అవ్వాలి అని ముందే రాసి పెట్టి(pre-planned failure) ఉంటే, ఆవేశపడి, టెన్షన్ పడి, బాధ పడి ధర్మాన్ని పెంచాలని, సత్యయుగం లాగా చేయాలని అనుకోవటం వలన ప్రయోజనం లేదు. ఒకవేళ దుర్మార్గులు సృష్టిని అణుబాంబులు వేసి ముందే నాశనం చేద్దామని అనుకొన్నా బ్రహ్మం చూస్తూ ఊరుకోడు. ఎందుకంటే తన నియమం ప్రకారం ఈ సృష్టి(కలియుగం) 4,32,000 సంవత్సరాలు జరగాలి.

సృష్టి ధర్మం మొదట, శరీర ధర్మం తర్వాత — మనిషి కలియుగంలో గల 1 పాద ధర్మాన్ని 4 పాదాలుగా అంటే సత్య యుగం లాగా చేస్తాను అంటే కుదరదు. అలాగే కలియుగాన్ని బట్టే మనిషి ధర్మం ఆధారపడి ప్రవర్తిస్తారు. నేరాలు, ఘోరాలు, అనేవి ఇప్పుడిప్పుడే మొదలైనాయి, పోను పోను వినటానికే భయపడేలా జరుగుతాయి.

కీర్తి – ఏమి గొప్ప పని చేసినా, మహా అయితే 4,32,000 సంవత్సరాలు గుర్తు ఉంటుంది, ఆ తర్వాత కొత్త యుగం మొదలవుతుంది... కావున కీర్తి కూడా అశాశ్వతమే..
భగవంతుడే విమర్శలు ఎదుర్కొంటున్నాడు, అలాంటిది అందరి దృష్టిలో మంచి అనిపించుకోవటం మనిషికి ఎలా సాధ్యం?

పదవి – చతుర్ముఖ బ్రహ్మ, విష్ణు, శివ పదవి కూడా ప్రళయాలలో కోల్పోయి మరో బ్రహ్మ, విష్ణు, శివ వస్తారు... అదీ అశాశ్వతమే... అటువంటప్పుడు పదవుల గోల ఎందుకు.

కష్టపడితేనే సుఖం – ప్రతి సుఖం వెనుక కష్టం, కష్టపడటం కోసం దుఃఖం(అది కొంత కాలమే ఉంటుంది, ఎప్పుడు పోతుందో తెలియదు)

ఈ ప్రపంచాన్ని బాగుచేయాలనే తపన, టెన్షన్, ఒత్తిడి అనవసరం – ఎందుకంటే 4,32,000 సంవత్సరాలకు ఎలాగు నాశనం అవుతుంది. కావున నీ పరిధిలో నీవు చేయగలిగినది చేయి, అంతేగానీ గుండెల మీద ఒత్తిడి పెట్టుకొని బాధపడనవసరం లేదు.. మనిషిని చనిపోనీయకుండా ఎంత ఆరాటపడినా 150 సంవత్సరాల తర్వాత అయినా కూడా చనిపోతాడు కాదా! అంటే మనిషికి మరణం తప్పదు, అలాగే సృష్టికి నాశనం తప్పదు!

సృష్టి యొక్క ప్రారబ్దాన్ని, వ్యక్తి యొక్క ప్రారబ్దాన్ని మార్చలేము – ముందుగా నిర్ణయం ప్రకారం ఎట్టి పరిస్థితులలో జరుగును... 4,32,000 సంవత్సరాలకు కలియుగాంతం అనేది సృష్టి జరిగినప్పుడే నిర్ణయం జరిగింది. దాని ప్రారబ్దాన్ని మార్చటం అసాధ్యం. మనిషి పుట్టుకతోనే ఎప్పుడు ఏమి చేయాలో, ఏమి దక్కాలో, ఎప్పుడు మరణించాలో అనేది ముందుగానే నిర్ణయం జరిగిపోయింది. ఆందోళన, బాధ పడి వ్యక్తులను మార్చాలని, సృష్టిని బాగు చేయాలని అనుకోకండి...

మంచి లేదు, చెడు లేదు — అంతటా, అన్నిట్లో ఉన్నది నేనే, బ్రహ్మమే ఉన్నది! అప్పుడు ఏది మంచి, ఏది చెడు? స్వర్గం నేనే, నరకం నేనే, దుర్మార్గం నేనే, సన్మార్గం నేనే! ... ఇలా జరిగితే బాగుండు, అలా జరిగితే బాగుండు అనే ఆలోచన అనవసరం.

ప్రారబ్దం ప్రకారం ఈ శరీరం ఏమి అనుభవించాలని రాసి వుందో తప్పక అనుభవిస్తుంది, లభిస్తుంది. దానికి సంబంద ఆలోచనలు ఎలాగూ వస్తాయి, వాటిని ఆపలేము.

కోపం – మనకు లభించవలసిన సుఖం, సంపద, కీర్తి లభించక పోవుటకు కారణం రెండో వ్యక్తి అయితే కోపం వస్తుంది, కానీ మనకు లభించక పోవుటకు మన స్వయంకృత అపరాధమే కారణం /మన తప్పిదమే(ప్రారబ్దం) అయితే, తన మీద తనకు కోపం కలుగుతుందా?

అసూయ – మనుష్యులు అందరూ బ్రహ్మ స్వరూపులే/నేనే, కర్మ ఫలముల తేడా వలన ఒకరికంటే మరొకరికి సంపద, సుఖములు వ్యత్యాసం కలిగినవి, అంతేగానీ మరే వ్యక్తి(మరో బ్రహ్మం) అయితే అసూయ కలగాలి కానీ, నాకే కావున అసూయ అనవసరం. ప్రారబ్దం వలన దక్కవలసినది ఎట్టి ప్రయత్నం చేయకపోయినా దక్కును, దక్కనిది ఎంత ప్రయత్నం చేసినా దక్కదు.

ఒకసారి ఆలోచించండి రోగం చెడ్డదా? కాదు మంచిదే! భూమ్మీద రోగం లేకుండా వ్యక్తులు 500సంవత్సరాలు బ్రతుకుతుంటే మొదట వచ్చే సమస్య ఆకలి. ఇప్పుడు మనిషి ఆయుర్దాయం 70సంవత్సరాలు ఉంటేనే తినడానికి తిండి లేక ఆకలితో మరణిస్తున్నారు అలాంటప్పుడు 500సంవత్సరాలు బ్రతికితే కొట్టుకొని చనిపోతారు, కావున మనిషికి రోగం రావటం వలన 70సంవత్సరాలకే చనిపోతున్నారు. కావున సృష్టిలో ఏదీ చెడ్డది కాదు, అంతా మంచే!

భగవంతునికి మంచి – చెడు తేడా లేదు: ఈ సృష్టిలో నీకు చెడు అయినది ఇంకొకరికి మంచి అవుతుంది, అలాంటప్పుడు అది చెడు ఎలా అవుతుంది, మనిషికి మలం చెడు, అదే పందికి అది మంచి ఆహారం. కుళ్ళిన కాయ నీకు చెడు, అదే కుళ్ళిన కాయ పురుగుకి మంచి ఆహారం.

నవ్వుకో: తన కొడుకు తన తండ్రితో ఆట ఆడుకొంటూ తండ్రిని భయపెట్టాలని చూస్తాడు, అది తండ్రికి నవ్వును కలిగిస్తుంటుంది. అలాగే డైరెక్టర్ సృష్టించిన సినిమా తననే భయపెడుతుంటే, ఏడ్పిస్తుంటే... తనలో తాను నవ్వుకోవాలి, విచిత్రం అంటే అదే! అలాగే సర్వ శక్తి, సర్వ విజ్ఞతతో సృష్టించిన నా సృష్టిలో గల భయం, కోపం, దుఃఖం నన్నే( బ్రహ్మాన్ని ) బాధపెడుతుంటే బ్రహ్మం నవ్వుకోవాలి.

జ్ఞాని అందరిలో తననే(బ్రహ్మాన్నే) చూస్తాడు. ఉదాహరణ అయ్యప్ప స్వాములు ఒకరిని ఒకరు నమస్కరించుకొంటారు, గౌరవం, ప్రేమాభిమానాలు చూపుకొంటారు. తనలోనూ అయ్యప్ప స్వామి ఉన్నాడు, అవతలి వ్యక్తిలోనూ అయ్యప్పస్వామి ఉన్నాడు కావున అవతలి వ్యక్తిని కోపగించుకోడు, ఈర్ష్యపడడు, ఎందుకంటే అతనిలోనూ అయ్యప్పస్వామి ఉన్నాడు అనే భావన అలా చేయనివ్వదు. ఈ మాలాధారణలో పైకి కనిపించే వస్త్రం చూసి అవతలి వ్యక్తిని దేవునిగా చూస్తాము, అదే భావనని జ్ఞాని అందరినీ పైకి కనిపించే వస్త్రం తో సంబంధం లేకుండా అంతటా ఉండే నేనుని(బ్రహ్మాన్నే) చూస్తాడు.

ఫీలింగ్స్ : ప్రధాన మంత్రి పదవి కానీ, నీలగిరి కొండలు అందాలు గానీ, ఐస్ క్రీం కానీ, అందమైన పువ్వు కానీ, ఇంటికి క్రొత్తగా వచ్చిన వస్తువు కానీ ఏమి ఇస్తుంది, ఫీలింగ్స్. మనిషి తన జీవితం మొత్తం అంతా కష్టపడి దేనికోసం శ్రమిస్తున్నాడు అంటే పదవిలో, ఆస్తిలో, వస్తువులో, కీర్తిలో తనకు ఫీలింగ్స్/అనుభూతి కలుగుతాయి, దానికోసమే ఈ తాపత్రయం అంతా కూడా, మనిషి తన కనీస అవసరాలకోసం కాకుండా ఇంకెక్కువ కోరుకొంటే అది కేవలం ఫీలింగ్స్ కోసమే. అంటే స్పర్శ వలన, చూడటం వలన, వినటం వలన ఆ అనుభూతి ఇంతకముందు చూడలేదు కాబట్టి దానిని పొందాలి అనే ఆరాటం. ఇంటిలో సాధారణ టీవీ ఉండటం అవసరం అయితే మంచి కంపెనీ, పెద్దది, మంచి సౌండ్, మంచి సౌకర్యాలు ఉండేది కోరటం అనేది ఫీలింగ్స్, ఆ సదుపాయాలు ఉంటే ఇంకా ఆనందాన్ని పొందవచ్చు, గొప్పలు చెప్పుకోవచ్చు. ఎవరైనా ఇంత ఖర్చు పెట్టి ఇలాంటి టీవీ కొన్నారు మీరు అని పొగుడుతున్నప్పుడు పొందే ఫీలింగ్స్ కోసం.

ఫీలింగ్ ఎంతకాలం ఉంటుంది: తాత్కాలికం, ఈ సత్యం ఎవరైతే తొందరగా గ్రహిస్తే వారు కోరికల సముద్రం నుంచి బయటపడతారు. క్రొత్తగా కొన్న టీవీ మీద ఎంతకాలం ఆ ఫీలింగ్ ఉంది, మొదట్లో రోజులో మొత్తం అంతా టీవీ కూర్చుని ఆ శబ్దం, ఆ దృశ్యం అనుభూతి పొందుతావు, ఒక సంవత్సరం తర్వాత ఫీలింగ్ తగ్గును, అలాగే ఇంకో మంచి మోడల్ టీవీ వస్తే ఏదైతే నీకు ఫీలింగ్ ఇచ్చినదో అది బోర్ కొడుతోంది. అవునా?
దీనినిబట్టి మనస్సుకి నిరంతరం అనుభూతి కలిగించాలంటే ఏమి చేయాలి? నిరంతరం క్రొత్తది అందించాలి, అది సాధ్యమా?కాదు. తెలుసుకోవలసినది ఏమిటంటే ఈ భూమ్మీద తాటిని తన్నేవాడిని తల తన్నేవాడు ఒకడు ఉంటాడు. అంటే ఈరోజున మార్కెట్లో గొప్పది ఈరోజున నీ సొంతం అయితే మరొకటి రేపు వస్తూ ఉంటుంది. మనస్సు యొక్క ఫీలింగ్స్ కి సంతృప్తిపరచటం భౌతికమైనవాటితో సాధ్యం కాదు, కానీ అసాధ్యం కాదు. మరి ఎలా సాధ్యం, అదే ఆత్మతత్వం, ఈ జ్ఞానం తెలుసుకొంటే నిరంతరం, ఎప్పటికీ, శాశ్వతంగా ఫీలింగ్స్/అనుభూతి పొందవచ్చు, ఎలా? నీవు ఎవరు? సర్వ శక్తి, సర్వ విజ్ఞతతో కూడిన బ్రహ్మం, ఎక్కడ ఉన్నావు? అంతటా ఉన్నావు. అంటే అన్ని వస్తువులలో/పదార్థాలలో/వ్యక్తులలో ఉన్నప్పుడు ప్రత్యేకంగా ఒకదానిని అనుభవించేది ఏమిటి?
రమణ మహర్షి ఎన్ని కోట్లు సంపాదించాడు అని ఆ ముఖం మీద చెరగని చిరునవ్వు, ప్రశాంతత, ఆత్మ సంతృప్తి అనేది కళ్ళల్లో, ముఖంలో చూడొచ్చు. అదే కోట్లు సంపాదించే వ్యక్తిలో, ఎంతోపేరు ఉన్నవ్యక్తిలో, అతిపెద్ద పదవిలో ఉన్నవ్యక్తిలో కూడా ఆ లక్షణాలు కనపడవు, కనపడ్డా అవి సహజమైనవి కావు.

అందరికీ అందుబాటులో: సంతృప్తి, ఆనందం అనేది వస్తువులలో భగవంతుడు పెట్టితే సృష్టిలో ఏదో పొరపాటు ఉన్నట్లే!, ఎందుకంటే భగవంతుడు అందరికీ న్యాయం చేసేలా ఉండాలి! అంటే డబ్బు ఉన్నవారికి మాత్రమే వస్తువులలో అనందం దొరికేటట్లు చేసి, డబ్బు లేనివారికి అనందం, సంతృప్తి లేకపోతే సృష్టిలో లోపం ఉంది అనుకోవాలి. భగవంతుడు వస్తువులలో తాత్కాలిక అనందం, సంతృప్తి పెట్టినాడు! శాశ్వత ఆనందం, శాశ్వత సంతృప్తి అనేది మనస్సులో పెట్టాడు. అంటే అది జ్ఞానం ద్వారా ప్రతి ఒక్కరు సులభంగా పొందేలా కల్పించాడు.

Part -5 **కర్మ x మోక్షం**

మోక్షం అనేది కర్మతో సంబంధం లేదు! ప్రారబ్దం తో సంబంధం లేదు!

కర్మ అంటే ఏమిటి, ఒక పని చేస్తే పలానా ఫలితం వచ్చుట, అంటే వేరు అయినది పొందుట. డబ్బు, కీర్తి, వస్తువు, వ్యక్తి, ఆరోగ్యం ... ఇలాంటివి పొందటం
కర్మ చేసే వ్యక్తి వేరు, పొందేది వేరు. కానీ మోక్ష సాధనలో సాధన చేసే వ్యక్తి ఎవ్వరు? బ్రహ్మమే!, ఎవరిని పొందాలి, బ్రహ్మన్నే!. అంటే తనను తాను పొందాలి!
తనను తాను పొందటం కోసం కర్మ అవసరం లేదు, అతను పొందే ఉన్నాడు. కావున ఇది ప్రారబ్దం వలన వచ్చేది కాదు, కర్మ వలన వచ్చేది కాదు, ఇది కేవలం జ్ఞానం వలన వచ్చేది. అంటే తాను బ్రహ్మం అనే విషయం మరచిపోయాడు, ఇప్పుడు సాధన ద్వారా గుర్తు చేసుకొంటున్నాడు. అందుకే ఎవరైనా పురుష ప్రయత్నం చేసి మోక్షం పొందవచ్చు. ఎంత వరకు సాధన చేస్తారో అంత జ్ఞానం జీవునితో పాటు వస్తుంది, కావున ఈ జన్మలో చేసిన సాధన వృధా అయిపోతుందేమో అనే బాధ అనవసరం.

కర్మ యోగం:
కర్మలు చేసేటప్పుడే స్వేఛ్ఛ ఉంది, అది చేయాలా? వద్దా? అని. కర్మ జరిగి పోయిన తర్వాత శిక్ష ను తగ్గించుకోవటం లో స్వేఛ్ఛ లేదు.

అంతటా ఉన్నది బ్రహ్మమే, కావున ఈ శరీరం లో వుండి చేస్తున్నది కూడా బ్రహ్మమే, కావున ప్రతి కర్మను బ్రహ్మార్పణం చేస్తే, కర్మల ఫలితం నందు, సంబందించిన వ్యక్తుల యందు, వస్తువుల యందు అనురాగం, ద్వేషం కలుగదు.
బ్రహ్మం ఈ శరీరమును పరికరంగా వినియోగించుకొని, బ్రహ్మమే సమస్త కర్మలను చేస్తున్నాడు/చేయిస్తున్నాడు అనే ఆలోచనతో కర్మ చేయుట.

పనిని అభివృద్ధి పరచాలనే కోరికలు /ఫలాపేక్ష పెట్టుకోవడంలో తప్పులేదు. ఆ పనిని ఎలా చేస్తున్నవన్నదే సమస్య. అంటే ఈ శరీరం గల పేరుతో "రామారావు" చేస్తున్నది అని అనుకొంటున్నావా? బ్రహ్మం చేయిస్తున్నది, ఈ శరీరం ఒక పరికరం అని అనుకొని చేస్తున్నావా?
Ex: లోక కళ్యాణం/సమాజం మంచి కోసం బ్రహ్మమే ఈ శరీరంతో చేయిస్తున్నది అని చేయటం ఉత్తమం.పని చేసేది బ్రహ్మమే, ఫలితాన్ని ఇచ్చేది బ్రహ్మమే! అప్పుడు కష్టమైనా, నష్టమైనా బాధలేదు. అలా కాకుండా శరీరమే చేస్తుంది అని అనుకొంటే బాధ!

నేను బ్రహ్మం - ఈ శరీరంలో కూడా ఉన్నాను - ఈ శరీరాన్ని పరికరంగా ఉపయోగించి కర్మ చేస్తున్నాను

# పదాలు – అర్థాలు

విముక్తి -- నిజ స్వరూపం తెలుసుకోవటమే

ధ్యానం – తాను ఎప్పుడూ బ్రహ్మం అని భావించుకోవటమే

అభ్యాసం – నిన్ను ఇబ్బంది కలిగే ఆలోచన రాగానే ఆత్మ విచారణ చేసుకోవటమే

సాధన పురోగతి ఎలా తెలుసుకోవాలి – కోరికలు తగ్గటం, తద్వారా ఆలోచనలు తగ్గటం

సంపూర్ణ శరణాగతి - ఏమి ఆలోచనలు, కోరికలు ఉండకూడదు. తనకన్నా శక్తివంతమనైన భగవంతునిపై పూర్తిగా ఆధారపడటం/వశం అవ్వటం. మంచి జరిగినా, చెడు జరిగినా – అదే విశ్వాసం ఉండాలి. నీవు కోరినట్లు, ఇష్టం వచ్చినట్లు జరగాలని భగవంతుని ఆజ్ఞాపించటం కాదు. ఏది మంచిదో, చెడో భగవంతునికే వదిలేయాలి. కర్తృత్వం వదిలేయాలి (నేను చేస్తున్నాను కాదు, అన్నీ భగవంతుడే చేయిస్తున్నాడు)

ధ్యానం – మనస్సుతో ప్రయత్నపూర్వకంగా చేసేది

సమాధి – ఎటువంటి ప్రయత్నం లేకుండా సహజంగా ఉండేది

సాక్షిగా ఉండటం - నేను బ్రహ్మం, సృష్టి ధర్మం కొరకు ఈ శరీరం పుట్టుకతో కొంత ప్రారబ్ధాన్ని తీసుకొని వచ్చాను, పుట్టినప్పుడే ఈ శరీరం నిర్వహించవలసిన కార్యకలాపాలు నిర్ణయమై పోయాయి. అవి జరుగవలసింది తప్పకుండా జరుగును, నాకు లభించే యోగం లేకపోతే, ఎంత ప్రయత్నించినా లభించదు. లభించే యోగం ఉంటే, ఏ విధముగాను తప్పించుకోలేను. కావున చేసున్న పనిపై మమకారం, అహంకారం లేకుండా సాక్షి గా చూస్తూ చేయటమే! బ్రహ్మమే చేస్తుంది, చేయించు కొంటుంది… ఇందులో శరీరం పాత్ర ఏమీ లేదు!

ఈ సృష్టి అంతా ప్రారబ్ధాల మూట - అందరి ప్రారబ్ధాలు అనుభవించటానికి ఒక స్థలం ఈ భూమి! నీకు ఉన్న స్వేచ్ఛ ఒక్కటే, జ్ఞానం పెంచుకొని, సత్యం తెలుసుకొని అహంకారం, మమకారం, కర్తృత్వం లేకుండా చేస్తూ, ఆగామి కర్మలు(బంధం) తగ్గించుకో!

మోక్షం – అనుభవ పూర్వకమైన ఆత్మ విద్య/జ్ఞానం (ex: భౌతిక మార్పు: ముసలితనం అనేది అందరిలో ఉంటుంది, అది కోరుకొంటే ఇచ్చేది కాదు, అనిభవిస్తేనే తెలుస్తుంది. భావన మార్పు: అలాగే మనస్సులో శరీరమే నేను అనే భావన → మార్పు చెంది –> బ్రహ్మమే నేను అనే భావన మనస్సులో స్థిరపడటమే(కన్య →గృహిణిగా, గుమస్తా →మేనేజర్ గా, గోల్డ్ -> రోల్డ్ గోల్డ్ అని తెలిస్తే)

కోరిక – వాసన → కోరిక అనేది నిత్య జీవితానికి అవసరమైనవి(అన్నం, మల/మూత్ర, వస్త్రం…) ఇది ప్రమాదం కాదు. వాసనలు అనేవి విలాసాలు, భోగాలు, ప్రారబ్ధంలో లేనివి(కారు, ఇల్లు…), ఇది ప్రమాదం, దీని వలన జన్మ ఎత్తాలి.

కర్మ – కర్మ జడం అంటే పుణ్యం, పాపం లేని పరికరం, కానీ దానిని ఉపయోగించే విధానంలో వలన పాపం(స్వార్ధం/క్రోధం/మోసం..), పుణ్యం(ప్రేమ,నిస్వార్ధం,…) వస్తుంది!

# బ్రహ్మం గురించి ఆధారాలు

ఇదం సర్వం పురాసృష్టేరేక మేవాద్వితీయకం|
సదేవాసీన్నామరూపే నాస్తామిత్యారుణేర్వచః || వేదాంత పంచదశి, 2వ అధ్యాయం, శ్లోకం 19
సృష్టి అంతా సృష్టించక ముందు, నామం, రూపం లేని ఒకే బ్రహ్మం మాత్రమే ఉంది

స దేవ సోమ్యేద మగ్రఆసీత్
ఏక మే వాద్వితీయం తస్మాదసతః సజ్జాయత్|| ఛాందగ్యోపనిషత్, 6వ అధ్యాయం, 2వ ఖండం, 1 వ శ్లోకం
సృష్టికి ముందు రెండోది లేదు, బ్రహ్మం ఒక్కటే ఉన్నది

న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్|
అజో నిత్యః శాశ్వతో యం పురాణో న హన్యతే హన్యమానే శరీరే|| కఠోపనిషత్ – 18 శ్లోకం
ఆత్మ పుట్టదు, నశించదు. ఇంకొకరివలన అది సృష్టించబడదు, నిత్యమైనది, శాశ్వతమైనది.

అత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ నాన్య
త్కిచ్చిన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి ఐతరేయ ఉపనిషత్ 1-1-1
సృష్టికి పూర్వం ఆత్మ ఒక్కతే ఉంది, ఆ ఆత్మ లోకములను సృష్టిస్తాను అని ఆలోచించెను.

తత్కర్మ కృత్వా వినివర్త్య భూయ
స్తత్వస్య తత్వేన సమేత్య యోగం
ఏకేన ద్వాభ్యాం త్రిభిరష్టభిర్వా
కాలేన చైవాత్మ గుణైశ్చ సూక్ష్మైః శ్వేతాస్వతరోపనిషత్
పరమాత్మ సర్వమును సృష్టించి, చైతన్యమును తన ప్రకృతి(జడం అయిన)లో చేర్చాడు. అనగా బ్రహ్మం తన నుంచి ఉద్భవించిన జడమైన మాయ తో తయారుచేసి, అందులో తనే చైతన్యముగా ఉన్నాడు.




యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వా దేహిన
స్థాణుమన్యేను సంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్ కఠోపనిషత్ 2వ అధ్యాయం
అజ్ఞానులు మరణానంతరం వేరే శరీరం పొందుటకు మాతృ గర్భం ప్రవేశించి శరీరం పొందుతున్నారు, అధములైన మరికొందరు రాళ్ళు మొదలగు రూపం పొందుచున్నారు. రాళ్ళు → చెట్లు → పక్షులు → పశువు → మనుష్యులు

Part -5 ప్రశ్నలు – జవాబులు

అందరూ ఎందుకు మోక్షం ఎందుకు పొందలేకున్నారు? మోక్షం అనేది భౌతిక వస్తువు కాదు, మానసిక పరివర్తన. అందరూ బ్రహ్మం అయినప్పటికీ, తాము శరీరం అని బలంగా నమ్ముతూ, తాము బ్రహ్మం అని నమ్మకం లేకపోవటం వలన, మోక్షం పొందలేకపోతున్నారు.

సద్గురువు ఎవరు? నీకు గురిని చూపినవారు. స్వీట్ తింటుంటే ఇంకా ఎలా తినాలనిపిస్తుందో, ఆ గురువు మాటలు వింటుంటే ఇంకా వినాలి అనిపిస్తే ఆ గురువు సద్గురువు. ఏ గురువు మాటలు వింటుంటే ధైర్యం, సంతృప్తి, ప్రశాంతత వస్తుందో ఆ వ్యక్తే గురువు.

ధర్మం/మంచి పనులు వలన మోక్షం వస్తుందా? మోక్షం రాదు, పుణ్యం వస్తుంది, జ్ఞానం వలనే మోక్షం వస్తుంది.

సృష్టి అలా జరిగితే బాగుండు, ఈ భూమ్మీద ఇది లేకపోతే బాగుండు? ప్రపంచం నందు రవ్వంత దోషం లేదు, అనవసరంగా గుండుసూది కూడా పుట్టించలేదు. ఈ సృష్టిని చేసింది సామాన్య మనిషి కాదు, సర్వ శక్తి + సర్వ విజ్ఞత కలిగిన బ్రహ్మం, కావున సృష్టిలో రవ్వంత దోషం లేదు. కాకపోతే దాని ప్రయోజనం తెలియక, గుర్తించక ఇలా చేస్తే బావుండు, అలా చేస్తే బావుండు అనుకొంటాము...

ధర్మం ఏమి? పరమ అధర్మం ->అధర్మం-> ఆపద్ధర్మం(ఏ సహాయం దొరకనప్పుడు తప్పు చేయటం..)--> ధర్మం(వ్యక్తిగత -->కుటుంబ -->రాష్ట్ర-->దేశ ప్రయోజనం, నిజం/మాట-->ప్రాణం) ---> పరమ ధర్మం(మోక్షం, ఆత్మజ్ఞానం, భక్తి)

ఉదాహరణ: భక్త ప్రహ్లాద తన తండ్రి మాట వినకపోవడం అనే వ్యక్తిగత ధర్మం, పరమధర్మం తో పోల్చితే తక్కువ. కావున పరమధర్మానికే ప్రాధాన్యత ఇచ్చాడు.

## జ్ఞానికి తేలు కుడితే నొప్పి తెలుస్తుందా?

దేహాత్మ బుద్ధి అనేది జ్ఞానికి, అజ్ఞానికి ఉంటుంది. అజ్ఞానికి  తేలు వేరుగా , శరీరం వేరుగా , నొప్పి వేరుగా చూస్తాడు. జ్ఞానికి  తేలు బ్రహ్మమే, నొప్పి బ్రహ్మమే, శరీరం బ్రహ్మమే అనుకొంటాడు! అన్నీ బ్రహ్మమే, అన్నీ బ్రహ్మం లోనే జరుగుతున్నాయి అనుకొంటాడు.

## జ్ఞాని కూడా పనులు చేస్తుంటాడు కదా?

అవును, ప్రారబ్దం అనేది చేయిస్తూ ఉంటుంది. కానీ ఆ పనులకు తాను కర్తను అని కానీ, కర్తృత్వంతో(శరీరమే చేస్తుంది అనే భావన) చేయటం గానీ జరగదు.

## జ్ఞానికి రుచులు, ధ్వనులు, వాసనలు, రూపాలలో తేడా గమనిస్తాడా?

అవును, పంచదార అంటే తీయగా ఉంటుంది అని, వేపకాయ చేదుగా ఉంటుంది అని గుర్తిస్తాడు. కాకపోతే అజ్ఞాని పంచదార వేరు, శరీరం వేరు, వేపకాయ వేరు అని, అది మంచిది, చెడ్డది అని నిర్ణయిస్తాడు. జ్ఞాని దృష్టిలో అన్నీ బ్రహ్మమే, అంటే పంచదార బ్రహ్మమే, వేపకాయ బ్రహ్మమే! వాటి ధర్మాలు, ఉపయోగాలు, పనిచేసే లక్షణాలు వేరయినా అవి అన్నీ బ్రహ్మమే, అన్నీ నేనే, నా రూపాలే, నా లక్షణాలే! కావున ఒకటిగానే చూస్తాడు!

## Phone/సోషల్ మీడియా చూడాలి, న్యూస్ పేపర్ చూడాలి, వింతలు/విషయాలు తెలుసుకోవాలి, టీవీ చూడాలి అనే కోరిక ఎలా కంట్రోల్ చేసేది?

ఫోన్ ఎవరు? బ్రహ్మమే!, అందులో ఉండే న్యూస్ ఎవరు? బ్రహ్మమే! టీవీ ఎవరు? బ్రహ్మమే! అందులో వచ్చే సినిమా ఎవరు? బ్రహ్మమే!
అందులో నటించే నటులు ఎవరు? బ్రహ్మమే! అన్నీ నేనే(బ్రహ్మమే) అయినప్పుడు నన్ను నేను చూడటానికి ఆసక్తి ఎందుకు? కోరిక ఎప్పుడు ఉంటుంది అంటే వేరేది ఏమైనా ఉంటే దానిని చూడాలి, పొందాలి, అనుభవించాలి అనుకొన్నప్పుడు. అన్నీ నేను అయితే కోరిక ఎందుకు?

## శరీరం చేసే పనికి కర్త,కర్మ,క్రియ భగవంతుడేనా?

శరీరం ఒక పరికరం, కర్త/కర్మ/క్రియ అన్నీ బ్రహ్మమే! బ్రహ్మమే సృష్టి ధర్మం కోసం తనే రూపం(శరీరం) తీసుకొని, తన శరీరాన్ని పోషణ చేసుకొని, తన శరీరం వదిలి వేస్తుంది! కానీ పొరపాటు ఏమిటంటే బ్రహ్మం రూపం తీసుకొన్నప్పుడు, అందులో ఉన్న బ్రహ్మం(అజ్ఞానం) తో ఉంటుంది, అందువల్ల ఆ శరీరం తాను చేసే పనులను బ్రహ్మ కాదు, శరీరమే చేస్తుంది అని భ్రమించి చేయటం వలన కర్మ(పాపం, పుణ్యం) వచ్చి, జన్మ/రూపం పొందుతుంది.

**అన్నీ బ్రహ్మమే, సర్వం బ్రహ్మమే అని తీవ్రంగా విచారణ చేస్తున్నప్పుడు నిద్ర/మైకం/మగత వస్తుంది?**

నీవు సాధన సరిగ్గా చేస్తున్నావని గుర్తు. ఎప్పుడూ హడావుడి, పరిగెత్తించే మనస్సుకి ఒక్కసారిగా బ్రేక్స్(సర్వం బ్రహ్మం అని నమ్మటం వలన) వేస్తే ఏమవుతుంది అంటే ఇలాంటి మైకం లాంటి స్థితి మొదట్లో కలుగుతుంది. అంతటితో ఆగకుండా వెళ్తే ఆలోచనలు నిదానం అవుతూ, మైకం తగ్గుతూ వస్తూ ఉంటుంది.

**అమెరికా అందమైన దేశం, అందులో నగరాలు, ఇల్లు, నదులు అద్భుతంగా ఉంటాయి, వాటిని చూడాలని ఉంది?**

అమెరికా దేశం ఎక్కడ ఉంది? బ్రహ్మం లోనే! అంటే సృష్టి ధర్మం లో భాగంగా నేనే(బ్రహ్మమే) అమెరికా దేశంగా ఉన్నాను, అక్కడి ప్రజలు, మట్టి, నదులు, ఇల్లు, వస్తువులు అన్నీ నేనే(బ్రహ్మమే)! కావున దాని ప్రత్యేకత ఇంకేముంది? నేను కానిది(అమెరికా వేరే బ్రహ్మం? ) అయితే దానిని చూడాలనే, పొందాలనే కోరిక ఉంటుంది, అదీ(అమెరికా) కూడా నేనే అయితే క్రొత్తగా అనుభవించేది, పొందేది ఏముంది!

**అవి ఎందుకు? ఇవి ఎందుకు? ఇది మంచిది కాదు, అది మంచిది కాదు అని అంటుంటారు?**

కొందరు సృష్టి లో ఇవి ఎందుకు? అవి ఎందుకు అని అంటుంటారు. సృష్టిలో చెడు అంటూ ఏదీ లేదు. అన్నీ మంచివే!

కర్మ, భక్తి, జ్ఞాన సిద్ధాంతం ఉండాలి, నాస్తికులు ఉండాలి. వాటిని ప్రచారం చేసేవారు ఉండాలి. మనుష్యులు వివిధ స్థితులలో ఉంటారు, వారికి మార్గదర్శనం చేసేవారు ఉండాలి కదా! అలాగే అందరూ పుణ్యాత్ములు అయితే భూమి, రాళ్ళు, జంతువులు, చెట్లు అనే జన్మ ఎవరు తీసుకొంటారు? మనుష్యులకు ఆహారం, నీరు, కార్లు, భోజనం, టీవీలు, పుస్తకాలు, వస్త్రాలు, బిల్డింగ్ లు ఎలా వస్తాయి. కావున సృష్టిలో అన్నీ ఉండాలి! అన్నీ మంచివే!

**అనారోగ్యం అయితే హాస్పిటల్ కి వెళ్ళకుండా ఉండాలా? పనిచేయకుండా కూర్చుంటే భోజనం ఎలా వస్తుంది?**

హాస్పిటల్ కి వెళ్ళొచ్చు, ఉద్యోగం చేయవచ్చు. ఇవన్నీ శరీర ధర్మాలు/అవసరాలు. కాకపోతే నేను శరీరం అనే భావనతో కాకుండా, నేను బ్రహ్మం అనే భావంతో చేయండి. నాకు ఈ రోగం వచ్చింది, ఆ రోగం వేరు, నేను(శరీరం) వేరు అనే భావన తప్పు. రోగం బ్రహ్మమే, హాస్పిటల్ బ్రహ్మమే, వైద్యుడు బ్రహ్మమే, మందు బ్రహ్మమే! అలాగే నేను వేరు, మేనేజర్ వేరు, ఆఫీస్ వేరు అని కాకుండా. మేనేజర్ బ్రహ్మమే, ఉద్యోగం బ్రహ్మమే, ఆఫీస్ బ్రహ్మమే! బ్రహ్మమే చేస్తుంది, అన్నీ బ్రహ్మం లోనే జరుగుతున్నాయి. బ్రహ్మమే చేపిస్తుంది, చేస్తుంది!

## ఉద్యోగం ఒత్తిడి తట్టుకోలేక, సంసారం బాధలు పడలేక సన్యాసం తీసుకోందాము అనుకొంటున్నా?

నేను శరీరం అనుకోవటం వలన ఉద్యోగం, సంసారం అనేవి బరువు అనిపిస్తుంది. నేను బ్రహ్మం అని అనుకొంటే, ఉద్యోగం, సంసారం(భార్య, పిల్లలు, తల్లిదండ్రులు) అన్నీ బ్రహ్మమే! ప్రారబ్దం ప్రకారం ఈ శరీరానికి ఏమి పొందాలో అవి తప్పక వస్తాయి! అని గుర్తించు. ఎందుకంటే నేనే(బ్రహ్మం) సృష్టి ధర్మం కోసం రూపం(ఈ శరీరం) తీసుకొని ఉద్యోగం, సంసార విధులు నిర్వహిస్తూ సృష్టిని ముందుకు తీసుకెలుతున్నాను. ప్రారబ్దం అనే కర్మ ద్వారా నేనే, సృష్టిని కంట్రోల్ చేస్తున్నాను, కావున నా ప్రారబ్దం నన్ను ఇబ్బంది పెడుతుంటే బాధపడటం దేనికి? వేరే ఎవరో(వేరే బ్రహ్మం) బాధపెడితే ఆలోచించాలి! ఇలా ఆలోచిస్తే అందరినీ సంతోష పెట్టాలనే కోరిక తగ్గును, ప్రయత్నం చేసి ఏది వస్తే దానితో సంతృప్తి పడతావు. మంచి, చెడు అంటూ ఏమీ ఉండదు! ఉద్యోగం నుంచి తీసేయాలి అని ప్రారబ్దం లో ఉంటే ఎంత టెన్షన్ పడితే దాన్ని ఆపగలవు? ప్రారబ్దం అనే రూల్ నేనే(బ్రహ్మమే) పెట్టుకొన్నప్పుడు, నేను(బ్రహ్మం) పాటించకపోతే ఎలా? ఒకవేళ భార్య/భర్త/పిల్లలు  వదిలి వెళ్తారు అని అంటే వెళ్ళనీ! అది వారి ప్రారబ్దం. నీవు దేనినీ బలవంతంగా కోరుకోకు, దేనినీ బలవంతంగా వద్దనకు! ఇస్తే తీసుకో, పోతే బాధపడకు! ఎందుకంటే అన్నీ నేనే(బ్రహ్మమే!)

## నాకు భయంగా ఉంది, దానిని ఎలా తొలగించుకోవాలి?

భయం అనేది ఒక భావన. అది బ్రహ్మం కంటే వేరుగా ఉందా? అదీ నేనే(బ్రహ్మమే!). నన్ను చూసి నేను భయపడతానా?
ఉదాహరణ: పాముని చూసి భయమెందుకు? పాము ఎవరు? బ్రహ్మమే! అంటే నేను, నన్ను చూసి భయపడటమెందుకు? కాకపోతే పాముకు బ్రహ్మజ్ఞానం తెలియదు కావున తన శరీర ధర్మం పాటించి భయపెట్టును. అలాగే నీవు నీ శరీర ధర్మం పాటించి దానికి దూరంగా ఉండు. అంటే మనస్సులో పాము అనేది బ్రహ్మమే(నేనే), కానీ శరీరం దృష్టి కోణంలో అది పాము ధర్మాన్ని నిర్వహిస్తుంది కావున, జాగ్రత్తలు పాటించాలి.

## దోమలు కుడుతుంటే ఏమి చేయాలి?

దోమలు కూడా బ్రహ్మమే! అన్నీ నాలోనే ఉన్నాయి. వాటి ప్రారబ్దం ప్రకారం నీ నిర్ణయం/ఆలోచన అమలు జరుగును. దానికి నిన్ను కుట్టిన తర్వాత కూడా ప్రాణంతో బయట పడాలి అని ఉంటే, నీవు కొట్టి చంపాలని ప్రయత్నం చేసినా అది తప్పించుకొంతుంది. అన్నీ కూడా ప్రారబ్దం(తప్పక అనుభవించాల్సిన కర్మ) ప్రకారమే జరుగును. అంటే ఆ సమయంలో దాని ప్రారబ్దం వలన నీవు చంపవచ్చు లేదా తోలవచ్చు లేదా అదే తప్పించుకు పారిపోవచ్చు. ఈ సృష్టిలో అన్నీ కూడా వారి వారి ప్రారబ్దాలను అనుభవించటానికి మరొకరు సహాయం చేస్తున్నారు. ఒక్కవేల వాటి ప్రారబ్దం వలన దోమలను నిజంగా చంపాల్సి వస్తే చంపు, కానీ శరీరం అనే నేను దోమలను చంపింది అనే భావన కాకుండా(కర్తృత్వం), బ్రహ్మం దోమలను చంపింది అనే ఆలోచన ఉండాలి! అప్పుడు ఆ కర్మ నీకు అంటుకోదు! బ్రహ్మం, బ్రహ్మాన్ని చంపుకొంది(లయ ధర్మం).

## ఏది నిజమైన కోరికలు? వాసనలు?

తినటం, త్రాగటం, నిద్ర, కాలకృత్యాలు కూడా కోరికలే! వాటిని తీర్చుకోవచ్చు. వాటి వలన హాని(జన్మ రాదు) జరగదు. ఎందుకంటే అవి మనస్సులో నాటుకోవు, అంటే మళ్ళీ, మళ్ళీ అనుభవించాలి అనే తీవ్రమైన వాంఛ కలిగించవు. అదే ఒక కారు కావాలి అనే కోరిక తీవ్రంగా వుండి, అది ఈ జన్మలో తీరకపోతే అది వాసనగా మారి అది తీరేదాక జన్మ ఎత్తాలి.

## పునర్జన్మ ఉందంటారా?

నేను శరీరమే అని  అనుకొంటే, ఉంది. నేను బ్రహ్మం అనుకొంటే లేదు. బ్రహ్మం అనేది నిరాకారం అది సహజ లక్షణం. రూపం లేకపోతే, మరణం లేదు, జన్మ లేదు. కానీ సృష్టి ధర్మం కోసం, బ్రహ్మం రూపం తీసుకొన్నప్పుడు ఆ శరీరం లో గల బ్రహ్మం, అజ్ఞానం వలన తాను శరీరం అనుకోవటం వలన, కోరికలు కలిగి, వాటిని తీర్చుకోవటం కోసం మళ్ళీ జన్మ తీసుకొంటున్నాడు! దీనినే పునర్జన్మ అంటారు.

## ప్రపంచం ఎందుకు దుఃఖమయంగా ఉంది? ఆకలి, పేదరికం, రోగాలు, తుఫానులు, వరదలు, ఎండలు?

భూమి ఎవరు? బ్రహ్మమే! వర్షాలు ఎవరు? బ్రహ్మమే! మనుష్యులు ఎవరు? బ్రహ్మమే! సూర్యుడు ఎవరు? బ్రహ్మమే! అన్నీ బ్రహ్మమే! అయినప్పుడు దుఃఖం గా ఎందుకు ఉంటుంది. నా పళ్ళు నా నాలికను కరిస్తే నాకు నొప్పి ఉంది, కోపంతో పళ్ళను కోడతానా? కొట్టవచ్చు కదా! పళ్ళు తప్పు చేసినవి కదా? ఎందుకు కొట్టటం లేదు? ఎందుకంటే పళ్ళు నాదే!, నాలుక నాదే! అయినప్పటికీ నాళిక తన ప్రారబ్దాన్ని పళ్ళ ద్వారా అనుభవిస్తుంది. అలాగే సృష్టిలో గల ప్రతీది నేనే(బ్రహ్మమే) అయినప్పటికీ సృష్టి ధర్మంలో భాగంగా నేనే ఆ రూపాలలో వుండి వాటి వాటి ప్రారబ్దాన్ని బట్టి అనుభవిస్తున్నాను.

## అంతా బ్రహ్మమే చేస్తుంటే చెడు అలవాట్లు వదిలిపెట్టాలని, మోక్షం సాధించుకోమని చెబుతుంటారు? అవన్నీ ఎందుకు?

నిజమే! అన్నీ బ్రహ్మమే చేస్తుంది. బ్రహ్మానికి తన సృష్టి, స్థితి, లయ ధర్మంలో భాగంగా చెడు అలవాట్లు, చెడు గుణాలు, చెడు భావాలు అవసరమైనాయి. నీవు చెడు అలవాట్లు వదిలించుకోవటం ఇష్టం లేకపాతే, మోక్షం కోసం ప్రయత్నం చేయటం ఇష్టం లేకపోతే, నీ సృష్టి ధర్మానికి అనేక జన్మలు ఎత్తుతూ నీ సృష్టికి సహాయం చేసుకో! ఇక్కడ ఎవ్వరూ బలవంత పెట్టటం లేదు, జన్మలు ఎత్తటం ఇష్టం లేకపోతే, మోక్ష సాధన చేసి నిరాకార బ్రహ్మంలో ఐక్యం అవ్వు. జన్మలు ఎత్తటం ఇష్టం అయితే, సాకార బ్రహ్మం(సృష్టి/రూపం) లో వివిధ రూపాలు తీసుకొంటూ, నీ సృష్టికి నీవే సహాయం చేసుకో! నీకు ఏది నచ్చితే అదే చేయి!

**అంతా ప్రారబ్దం ప్రకారమే జరిగితే, మనిషికి గల స్వేచ్ఛ ఎక్కడుంది?**

జ్ఞానం సంపాదించటం లోనే స్వేచ్ఛ ఉంది. ప్రారబ్దం ప్రకారం శరీరానికి ఏమి పొందాలో అవి పుట్టినప్పుడే నిర్ణయమై పోయింది, అలాగే ఎప్పుడు మరణించాలో కూడా నిర్ణయమైపోయింది. జ్ఞానం అనేది ప్రారబ్దం తో సంబందం లేదు కావున, జ్ఞానం సంపాదిస్తే, ఆ జ్ఞానంతో కర్మ చేసేటప్పుడు శరీర తాదాత్మ్యం లేకుండా చేస్తే జన్మ రాదు, శరీరమే నేను అనుకొని చేస్తే జన్మ వస్తుంది. ప్రారబ్దం అనేది సినిమా హాల్ లో రిలీజ్ అయిన సినిమాను చూడటం లాంటిది, సినిమా చూస్తూ పాలనా డైలాగ్, ఫైట్, పాట మారుద్దామని అనుకొంటే కుదురుతుందా?, రిలీజ్ అవకముందే ఎడిటింగ్ చేయాలి.

**బ్రహ్మం ఎందుకు సృష్టి చేయాలి? అందరిని కష్టపెట్టటం ఎందుకు?**

ఈ సృష్టిలో ప్రతి దానికి ఒక సహజ ధర్మం ఉంది, అలాగే బ్రహ్మానికి కూడా ఒక సహజ ధర్మం ఉంది, అదే సృష్టి, స్థితి, లయం చేయటం.
ఈ సృష్టి క్రియకు బ్రహ్మమే తనకు తాను అజ్ఞానం కలిగించుకొని, తనే రూపం తీసుకొని, తనే కొంతకాలం వుండి, తనే మళ్ళీ లయం(నాశనము) అవుతుంది. ఇక్కడ బ్రహ్మం తప్ప ఇంకెవ్వరూ లేరు. బ్రహ్మం నిన్ను ఆడించుట లేదు, తనకు తానే ఆడుకొంటున్నాడు. ఈ జ్ఞానం తెలియక ఎవరో దేవుడు ఆడిస్తున్నాడు అని అనుకొంటున్నావు. సాలెపురుగు నోటితో గూడు తాయారు చేసి, కొంతకాలం వుండి, మళ్ళీ నోటితో గూడుని నాశనం చేసుకొంటుంది.

**బ్రహ్మ భావన సాధన అన్నింటికంటే గొప్పదా?**

భక్తి యోగం సాధన చేసేవారు, బ్రహ్మ భావన సాధన చేయలేరు. ఎందుకంటే వారికి ఒక రూపం కావాలి. బ్రహ్మ భావన సాధన(నేను బ్రహ్మం, సర్వం ఉన్నాను) అనేది అనంత పుణ్యాన్ని వెంటనే ఇవ్వగలిగే శక్తివంతమైనది. కావున ఏ స్థితిలో వున్నవారు వారికి అనుకూల సాధన చేయటం ఉత్తమం. జ్ఞాన యోగ సాధన చేసేవారికి రూపం అంటే ఇష్టం ఉండదు( దేవుడిని పూజించటం, ప్రార్ధించటం, పాటలు పాడటం) అటువంటి వారికి బ్రహ్మ భావన సాధన మంచిది.

**సాధన అంటే?**

ప్రారబ్దం అంటే తప్పక అనుభావించాల్సినవి, అంటే మానసిక, శారీరక సుఖం, దుఃఖం. వాటిని నేను శరీరం అనే భావనతోనే అనుభవించాలి. అప్పుడు సాధన గురించి మరచిపోయే ప్రమాదం ఉంది, తిరిగి ప్రయత్నం పూర్వకంగా నేను బ్రహ్మం అని మనస్సుకి గుర్తు చేస్తూ పురోగతి సాధించాలి. ఒకవేళ శరీర భావనతో కొంతకాలం అనుభవించినా, అదీ కూడా బ్రహ్మం లోనే జరిగింది అనుకో!

### అన్యాయం, అధర్మంగా వస్తువు తీసుకొంటుంటే ఏమి చేయాలి?

అన్యాయం చేసే వ్యక్తి బ్రహ్మం అయినప్పటికీ తాను అధర్మం చేస్తున్నాడు కావున వారిపై న్యాయ పోరాటం చేయాలి. ప్రక్క శత్రు దేశం అనేది బ్రహ్మమే! కానీ ఆ దేశం అధర్మం, అక్రమంగా మన దేశంలోకి వస్తుంటే వారిపై యుద్ధం చేయాలి. అంతేగానీ అంతా బ్రహ్మం కదా అని చూస్తూ ఊరక ఉండరాదు!

**ఉదాహరణ:** దుర్యోధనుడు ఎవరు? బ్రహ్మమే!, రావణాసురుడు ఎవరు? బ్రహ్మమే! అయినప్పటికీ వారు అన్యాయం, అధర్మం చేస్తున్నారు కావున యుద్ధం చేసి అధర్మాన్ని నాశనం చేశారు. అలాగే అధర్మం వైపున బ్రహ్మమే ఉన్నప్పటికీ, మనం కూడా ధర్మం కోసం పోరాటం చేయాలి. అంటే నన్ను నేను చంపేసుకొంటున్నాను(బ్రహ్మం, బ్రహ్మాన్ని చంపేసుకొంటుంది(లయం)/బ్రహ్మం, బ్రహ్మంపై యుద్ధం/పోరాటం చేస్తుంది!).

### ప్రారబ్దం వలన ఊహించని రీతిలో కష్టాలు

✍: యాత్రలోనే కాదు, మన జీవితంలో కూడా ఎలాంటి ప్రమాదాలు, కష్టాలు సంభవించినా అది మన పూర్వజన్మకర్మ వల్లనే. ఈ విషయాన్ని వివరించే ఓ కథ ప్రాచుర్యంలో ఉంది: ఒక దైవ భక్తుడు పూరీ జగన్నాథ యాత్రకు బయలుదేరాడు. దారిలో ఒక రాత్రి ఓ ఇంటి అరుగుపైన విశ్రమించాడు. ఆ ఇంటి యజమానురాలు బయటకు వచ్చి అతణ్ణి కామవాంఛతో ప్రలోభపెట్టింది. అప్పుడు ఆ భక్తుడు, 'పరపురుషునితో అధర్మ కార్యాలను చేయడం పాపం' అని తిరస్కరించాడు. అప్పుడు ఆమె ఇంటిలోకి వెళ్ళి, నిద్రిస్తున్న భర్త తల నరికి, బయటకు వచ్చి మళ్ళీ అతనికి తన కోరికను తెలిపింది. అప్పుడు కూడా అతడు నిరాకరించాడు. దాంతో ఆమె కోపగించి, 'నా భర్తను చంపి నన్ను బలాత్కరించబోతున్నాడ'ని గట్టిగా అరచింది. అందరూ వచ్చి చూసి, ఆ భక్తుని చేతులు ఖండించారు. అయినా అతడు యాత్ర సాగించి పూరీ క్షేత్రం చేరుకున్నాడు. శ్రీకృష్ణుడు అక్కడి పూజారులకు కలలో కనిపించి, 'నా భక్తుడు వస్తున్నాడు. అతణ్ణి ఘనంగా సత్కరించాల'ని ఆదేశించాడు. పూజారులు అతనికి ఘనస్వాగతం పలికారు. తరువాత ఆ భక్తుడు, ఆలయంలో దేవుణ్ణి దర్శించగానే అతనికి మళ్ళీ చేతులు యథాతథంగా వచ్చాయి. ఈ విపత్కర పరిస్థితులకు కారణమేమిటని ఆ భక్తుడు, భగవంతుణ్ణి ప్రశ్నించగా "నిన్ను కష్టపెట్టిన స్త్రీ క్రిందటి జన్మలో ఓ ఆవు. నీవు ఆ ఆవును నీ చేతులతో కసాయివాడికి అప్పగించావు. వాడు ఆ ఆవు తల నరికాడు. ఆ కసాయే ఈ జన్మలో ఆమె భర్త. అందుకే ఆమె వాని తల నరికింది. నీవు కసాయివానికి పట్టి ఇచ్చినందుకు, నీ చేతులు ఖండించబడ్డాయి. ఇంత కష్టంలోనూ నాపై నీకు విశ్వాసం సడలనందున నీ చేతులను నీకు ప్రసాదించాను" అని వివరించాడు. కాబట్టి, మన ప్రారబ్ధకర్మ వల్ల కష్టాలు కలుగుతాయి. కానీ, భక్తి వల్ల కష్టాల తీవ్రత తగ్గిపోతుంది. ఏం జరిగినా సరే భగవంతుని పట్ల భక్తిని విడువరాదు. ❖

# ప్రారబ్ధం – ప్రయత్నం/స్వేచ్ఛ

మానవ జన్మ వచ్చేటప్పుడు కేవలం ప్రారబ్ధముతో మాత్రమే రారు,అలా అయితే ముక్తి పొందటానికి స్వేచ్ఛ లేదు. వాసనలు అంటే పూర్వ జన్మలలో తీరని కోరికలు, అవి అనుభవిస్తే పోతాయి.

**జన్మ = వాసనలు తీర్చుకోవటానికి + ప్రారబ్ధం/పూర్వ కర్మ ఫలితాలు(మంచి, చెడు) అనుభవించటానికి(తప్పక అనుభవించాలి) + సాధన/జ్ఞానం**

ప్రారబ్ధం మార్చబడదు, తప్పక అనుభవించాలి.

వాసనలను తీర్చుకోవటానికి ప్రతి జన్మలో అవకాశం వచ్చినప్పుడు ప్రయత్నం చేస్తుంటాడు, దాని గురించే క్రొత్త కర్మలు చేస్తుంటాడు, వాటి వలనే పాపం, పుణ్యం వస్తుంది. మళ్ళీ క్రొత్త వాసనలు తయారు అవ్వటం, మళ్ళీ జన్మ వచ్చి, సృష్టి కొనసాగుతుంది.

గమనిక: మోక్షం/సాధన అనేది ప్రారబ్ధంలోకి రాదు

ప్రారబ్ధములోకి ఏమి వస్తాయి? జన్మ, రంగు, కులం, భార్య, ఆస్థి, కీర్తి, రోగం,.... భౌతిక సంపదలు అన్నీ ప్రారబ్ధం క్రిందికి వస్తుంది.

సాధన సంబంధం అంటే భక్తి, ఉపాసన, పూజ, జపాలు, అంటే భగవంతుని పొందాలనే చేసే శారీరక, మానసిక శ్రమ అన్నీ కూడా ప్రారబ్ధం క్రిందికి రాదు. కావున ప్రయత్నం చేసి సాధన చేస్తే ముక్తి వస్తుంది, చేసుకోకపోతే ముక్తి రాదు.